# గ్లోకీన్-డిలో శక్తి ఉంది

## అది ముఖంపై చిందుతుంది!




గ్లోకీన్-డి ప్రతివారికీ వెంటనే బలం యిచ్చే శక్తి గలది. అలసటను దూరం చేస్తుంది, చేవని పెంచుతుంది. గ్లోకీన్-డి, గ్లూకోస్‌లోగల అన్ని పదార్థాలతో నిండివుంది. దాంతోబాటే మరింతగా కాల్షియమ్, ఫాస్ఫేట్లు విటమిన్ డి లతో పుష్టికరంగా చేయబడింది. అన్నివేళలా, అనుక్షణమూ దీంతో యిక మీకు స్ఫూర్తి, బలం.

గ్లోకిన్-డి ప్రతి రోజూ తీసుకునే అలవాటు చేసుకోండి.

## గ్లోకిన్-డి

వెంటనే శక్తినిచ్చే వాటితో నిండిన కొత్త గ్లూకోస్-డి

JLKA.GD-18 TEL

* FLASH TIMES * ENGLISH DAILY WITH A DIFFERENCE *** AWAIT RELEASE ON UGADI ( 17-3-1980 )





## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]
శుక్రవారం : 1–2–'80
సిద్ధార్థినామ సం. మాఘ. పూర్ణిమ
***సంపుటము 73 : సంచిక 23***
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
*ఆంధ్రపత్రిక. కార్యాలయము*
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



## ము ఖ చి త్రం

'భలేకృష్ణుడు' కృష్ణ, జయప్రదల ముఖ చిత్రం, ఆంధ్రసచిత్రవారపత్రికకు, ఎంతో వన్నె తెచ్చింది. ఎంతోకాలం తరువాత అత్యంత ఆకర్షణీయమైన ముఖచిత్రాన్ని ప్రచురించారు.

"మన క్రికెట్ కుర్రాళ్ళకి జేజేలు" వీరాజీగారి వ్యాసం బాగుంది.

దయ్యకంటి సుబ్బారావు [వినుకొండ]

* *

అందాలతార జయసుధ ముఖచిత్రంతో వెలువడిన నా అభిమాన ఆంధ్రసచిత్రవారపత్రికఅత్యంతాకర్షణీయంగా వుంది. రెండు సీరియల్ కథలు చాలా బాగున్నాయి. ఈవారం ప్రచురించినవి రెండే కథలు. కథలు ప్రచురించే విషయంలో జాగ్రత్తగా పరిశీలించాలని మనవి. అదేవిధంగా ఈ వారం మరీ నాలుగంటే నాలుగే కార్టూనులు ప్రచురించారు. వీటిసంఖ్య పెంచితే పత్రికా చూపరులను యిట్టే ఆకర్షిస్తుందని నా భావన.

పి. వి. రామనాథరావు [మధిర]

## క్రి కె ట్

క్రికెట్ కుర్రాళ్ళకి జేజేలు చాలా బాగుంది. వంటింటికుందేలు బాబు రంగులబొమ్మలు, కథ రెండూ కమనీయంగా ఉన్నాయి. "బొమ్మల మహాభారతం" బొమ్మలలో వ్రాత కొంచెం ఇబ్బందికరంగా ఉంది.

వల్లభనేని హనుమయ్యచౌదరి [వడాలి]

## క థ లు

నేటి వీరుడు రేపటి పౌరుడు ముఖచిత్రము అత్యంత ఆకర్షణీయంగా ఉంది. ఆ సంచికలోని కథలలో వేట కథ చాలా బాగుంది.

కృష్ణ, జయప్రదల ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రపత్రికలో "టీచర్సుడే, వంటింటికుందేలు" కథలుచాలా బాగున్నాయి. బొంబాయి టెస్ట్‌లో గెలిచిన "మన క్రికెట్ కుర్రాళ్లకి జేజేలు" అన్న వీరాజీగారి వ్యాసం ఎంతో హుషారుగా ఉంది. "స్వయంవరం" సీరియల్ ఎంతో ఇంటరెస్టింగ్‌గా సాగుతుంది.

మాదల శివరామప్రసాద్, హనుమంతరావు, రవిప్రసాద్, విద్యానగర్ [పొన్నూరు]

* * *

11.1.80 ఆంధ్రపత్రిక వీక్లీలో టీచర్సుడే కథ చాల జాలిగాఉంది. వంటింటికుందేలు కథలో రంగులవలన ఆకర్షితమైంది. ప్రాక్టీసుపెట్టిచూడాలి ముగింపు బాగాలేదు. కథలసంఖ్య పెంచండి.

కాచం రమేశ్ [పరకాల]



—దేశాంగశాఖ పెద్ద మంత్రి

వెనకటివి తల్చుకుని వెక్కి వెక్కి ఏడ్వాలని జనాన్ని కోరితే— స్వా॥ల వలింపుల మళ్ళీ మొదలెడితే "30 సం.లుగా ఈ ప్రజాస్వామ్యం వెలగబెడతుంది అనుకుని దానికే తాము సగం చస్తూ కూడా, ప్రాణం పోస్తున్న ప్రజావీకానికి ద్రోహం చేసినవారే అవుతారనుకూ—" అన్న హెచ్చరిక అధికార



హోంశాఖ చిన్న మంత్రి

వర్షాన్ని వెంటాడుతూ సర్వే సర్వత్రా గాలిలో కలిసిపోన్న తరుణంలో అందరూ శ్రీమతి యిందిరాగాంధీ రేడియోలో మళ్ళీ ప్రధానమంత్రిగా "భాయియో ఔర్ బహినో" అని ఎలుగెత్తగా, వినడానికి, సమధికోత్సాహంతో ఉరకలు వేస్తూ వెళ్తున్న తరుణంలో సరికొత్త పాత ప్రధాన మంత్రి "ఇందిరమ్మను" లోక కళ్యాణార్థం పునరంకితం కమ్మని కోరుతూ అభినందనిస్తూ "మా తాజాకాలమ్"కి...

[సిరాజ్ 14-1-'80]

లోకం పోకడ









**య**జ్ఞనారాయణ శర్మ ఆంధ్రా యూనివర్సిటీలో తెలుగు విభాగంలో రీడరుగా వుంటున్నాడు

# యజ్ఞుని విరహం

డి.ఎల్.ఎన్. శాస్త్రి



కాళిదాసు కవిత్వం మేఘసందేశం అనే విషయం మీద పి. హెచ్. డి. తీసుకున్నాడు

కాళిదాసు, కృష్ణశాస్త్రి, రాయప్రోలు వీరి స్త్రీ సమారాధన తత్వం శర్మ మనస్తత్వంలో బాగా జీర్ణించుకుంది. అతనికి కొత్తగా పెళ్ళయింది. భార్య యమున. వాల్తేరులో కాపురం పెట్టి మూడు నెలలయింది. కాలేజీ వదిలితే యమునతోడిదే లోకం. ఇంట్లో యమునకి సాయంగా వంట చేసేవాడు. బీచి షికార్లు. ఈ మూడు నెల్లలోనే యమునకి మేఘగా దిగడ్డ, సింహాచలం, వెంకటేశ్వరా కొండలు అన్నీ చూపించాడు. గాతుళ్ళ అతి మధురమైనవి రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి. ఖరికి యమునకి అలంకరణలో కూడా సాయపడేవాడు. యమున సిగ్గుపడిపోయేది. 'వెళ్ళండి' అని కసురుకునేది. ఫ్రెండ్సంతా 'ఆడారి' అని గేలిచేసేవారు. యూనివర్సిటీలో మాత్రం శర్మ పాఠం చెప్తుంటే అందరూ మంత్రముగ్ధులై వింటుంటారు. శర్మ పాఠంతో పాటు వాళ్ళని ఇంకో లోకంలోకి తీసుకుపోయేవాడు. ఆ విధంగా గడుస్తుంటే శర్మ జీవితంలో అనుకోని అవాంతరం వచ్చి పడింది.

ఒకరోజు ప్రొఫెసరు శర్మని పిలిచి తొమ్మిది వారాలపాటు కల్చరల్ ఎక్స్ఛేంజి ప్రోగ్రాము క్రింద శర్మని లండను పంపిస్తున్నట్లు, అక్కడ మేఘ సందేశం మీద లెక్చర్లు ఇవ్వాలని చెప్పాడు. శర్మ విన్నాడు. విని మౌనంగా ఉండిపోయాడు. "ఏమిటి అలా నీళ్ళు నములుతున్నావ్? ఇంకా పదిహేను రోజుల్లో వెళ్ళాలి అండర్‌స్టాండ్" అన్నారు ప్రొఫెసరు. ప్రొఫెసరిగారుమీద భయంకొద్దీ ఏమనలేక వచ్చేశాడు. వార్త దావానలంలా పాకిపోయింది. శర్మ దిగులుగా స్టాఫ్ రూములో కూర్చున్నాడు. తోటి కొలీగ్స్ కంగ్రాట్స్ చెప్పారు. బంగరుశెట్టి 'గురుడు ఛాన్స్ కొట్టేశాడు" అన్నాడు. రామ్మూర్తి 'లక్కీ ఫెలో, పెళ్ళవగానే అదృష్టం పట్టింది" అన్నాడు. "ఏమిటోయ్ ఇంత మంచి రోజున కూడా ఆముదం తాగినట్టు మొహం పెట్టేవ్?' అన్నాడు శెట్టి. "నాకిష్టం లేదు గురూ వెళ్ళడం" అన్నాడు

శర్మ మిత్రులంతా ఫకాలుమని నవ్వారు. "అబ్బ. ఏం జోకేశాడోయ్. నాకే ఛాన్సు వస్తే నా ఈ పాటికి ఏ బురుషోత్తులో ఉండేవాడిని" అన్నాడు శెట్టి "పోనీ నువ్వు వెళ్ళకూడదూ ప్రొఫెసరుతో చెప్తాను" అన్నాడు శర్మ "ఏం తమాషా చేస్తున్నావా? అని నెమ్మదిగా లెక్కచేయగలడు, ఆ పని మటుకు చేయకు" అన్నాడు శెట్టి. "పాపం కొత్త కాపురం గదా అందుకని. అసలే మేఘ సందేశం మీద లెక్చరు. సరిగ్గా అమిరాయోయ్ శర్మ" అన్నాడు రాజు. "నిజంగా అనుభవిస్తావేమో, లెక్చర్లు దంచేస్తావ్" అన్నాడు రామ్మూర్తి. "నిజంగా నాకిష్టం లేను ఫ్రెండ్స్" అన్నాడు శర్మ "ఇంకోసారి అన్నావంటే తంతాం" అన్నారు మిత్రులు ముక్త కంఠంతో.

రాత్రి యమున గాఢ పరిష్వంగనలో ఉన్నప్పుడు చెప్పలేక చెప్పలేక చెప్పాడా వార్త శర్మ యమున ఒక్కసారి ఎగిరి గెంతేసింది. "ఇదేమిటండీ ఇంత మంచివార్త ఇంత ఆలస్యంగనా చెప్పడం" అంది. "అదేమిటి యమునా? నిన్ను వదలి ఉండలేను. నన్ను విడిచి ఉండడం నీకిష్టమా?" అన్నాడు శర్మ. "అదేమిటండి ఇంతి మంచి అవకాశం వస్తే. నిమిషాలు వారాలు ఎంత ఇట్టే అయిపోతాయ్ మీరేమీ దిగులు పడకండి" అంది యమున అయినా శర్మ ఉత్సాహంగా లేదు. రోజులు గబగబా గడిచిపోయాయ్. మిత్రులు బలవంతం మీద రెండు సూట్లు కుట్టించాడు. ఇంక రేపే ప్రయాణం. ఆ రోజు యమునతోడిదే లోకం. యమునని బిగియారా కౌగలించుకున్నాడు. పువ్వులు నలిగి పోతున్నాయి. అగరొత్తులు హరించుకు పోతున్నాయి. యమున సిరోజాల సంపెంగ నూనె వాసనలు గుబాళించాయి. అదే తొలిరేయేమో అన్నట్టుగా గడిపారు వారిరువురు.

శర్మ వెళ్ళేరోజు ఉదయమే యమునని తీసుకు వెళ్ళడానికి ఆమె నాన్నగారువచ్చారు. ఆరోజు కొందరు మిత్రులు, విద్యార్థులు, యమున తండ్రి, శర్మ తండ్రి ఏయిరు పోర్టుకి వెళ్ళారు. ప్రొఫెసరు గారు కూడా వచ్చి ఆశీర్వదించారు. శర్మ అందరికీ వీడ్కోలు చెప్పాడు. అతి భారంగా యమున దగ్గరకు వచ్చి చేయి తాకాడు. యమున కూడా చలించింది. "వస్తాను" అన్నాడు నీరసంగా. "క్షేమంగా వెళ్ళిరండి" అంది

# యజ్ఞుని విరహం

యమున గద్గద కంఠంతో

ఫ్లైట్ కొత్త శర్మకి. సీట్లో కూర్చుని బెల్టు కట్టుకున్నాడు. అంతా కొత్త కొత్తగా ఉంది. హాయిగా సవ్యంగా, సజావుగా యమునతో గడపే రోజులకి అంతరాయం ఎందుకు జరగాలి? ఫారెన్ అంటే అంత మోజేమిటి అందరికీను అనుకున్నాడు. సాయంత్రం అయిదున్నరకి విమానం హైద్రాబాదు చేరుకుంది మళ్ళీ ఏడున్నరకి బొంబాయికి ఫ్లైట్ తీసుకున్నాడు. అది సుమారు తొమ్మిది గంటలకి బొంబాయి చేరింది. అప్పుడే రెండు ప్లేన్సు మారాడు. వింత అనుభవం కలిగింది. రాత్రి ఒంటిగంటకి బొంబాయిలో ఏయిర్ ఇండియా జంబో ఎక్కాడు. విమానం లోపల గోడలకి గౌతమబుద్ధుడు, రామ వనవాసం, గోకులంలో కృష్ణలీలల చిత్రాలు ఆకర్షించాయి శర్మని. ఎవరో బలవంతంగా తనని యమున నుంచి దూరం చేసినట్టు బాధపడుతున్నాడు శర్మ. ఎయిర్ హోస్టెస్ కేటరింగు మధ్య మధ్యలో ఆలోచనలకి అంతరాయం కలిగిస్తోంది. అగునా తనకీ యక్షునికి తేడా ఏమిటి? యక్షుడు కుబేరుడ శాపం పొందాడు. తనకు? ఈ పర్యటన శాపం లాంటిదే. విమానం ముందుగా కువైట్ చేరింది. తరువాత రోమ్, పారిస్. ఒకప్రక్క చిమ్మ చీకటి మరొకపక్క ఉదయిస్తున్న సూర్య బింబం. విమాన వేగం తెలియటంలేదు. అందరు ప్రయాణికులూ మత్తుగా జోగుతున్నారు. పారిస్ నుంచి లండను మరొక గంట పట్టింది. లోకల్ టైము ఉదయం తొమ్మిదైంది. శర్మ వాచీ కరక్టు చేసుకున్నాడు. మొత్తం పన్నెండు పదమూడు గంటల ప్రయాణం. ఏయిర్ హోస్టెస్‌కి థ్యాంక్సు చెప్పి లండనులో దిగాడు.

తన ప్రొఫెసరుగారు ముందే వ్రాయడం వల్ల హీత్రో విమానాశ్రయానికి ప్రొఫెసరు బ్రౌన్ వచ్చారు. నవంబరు మాసం కొంచెం చలిగా ఉంది. ప్రొఫెసరు బ్రౌన్ శర్మతో కరచాలనం చేశాడు. ఇద్దరూ కరచాలనం చేసే ముందు వెతుక్కొని ఐడెంటిటి తెలియజేయడానికి కొంత టైము పట్టింది. "వెల్‌కమ్ మిస్టర్ యగెన్ శమ" అన్నారు

బ్రౌన్. బ్రౌన్ శర్మని తన కారులో ఇంటికి తీసుకువెళ్ళాడు. తన ఇంటిలోనే ఒక రూము చూపించాడు. బ్రౌన్ గారి అమ్మాయి మేరీ. అమె కూడా తెలుగులో అధ్యయనం చేసింది. మేరీ కూడా శర్మతో కరచాలనం చేసింది. శర్మ కొద్దిగా జంకాడు, సిగ్గుపడ్డాడు. "శర్మా మీరు రిటర్ను అయ్యేలోగా నాకు తెలుగులో చాలా క్వెయరీస్ ఉన్నాయి మీరు చెప్పాలి" అంది మేరీ ఇంగ్లీషు ఏక్సెంటుతో. ఓకే అన్నాడు శర్మ. బ్రౌన్‌గారు వెళ్ళేప్పుడే లెక్చరు హాలుకి తీసుకు వెళతానన్నారు. శర్మ వెజిటేరియను అని తెలుసుకుని ఉడకబెట్టిన బంగాళా దుంపలు, టమాటోలు, పాలు, పంచదార, బ్రెడ్ తెచ్చియిచ్చింది మేరీ. మిసెస్ బ్రౌన్ కూడా వచ్చి శర్మని ఆప్యాయంగా పలకరించింది. శర్మ అవి తిన్నాక బట్టలు మార్చుకున్నాడు. స్వెట్టరు వేసుకుని హీటరు ఆన్ చేశాడు. ప్లేన్ ప్రయాణం బడలిక వల్ల పడుకున్నాడు. మంచినిద్ర పట్టింది. మళ్ళీ ఉదయమే లేచాడు.

ఉదయం లేచేసరికి తొమ్మిదయింది. అయినా చీకటిగా ఉంది. ఇండియాలో లాగ కాకులు అరవడం, భక్తిరంజని కార్యక్రమాలు, యమున పూజలు లేవు. అంతా నిశ్శబ్దంగా ఉంది. తన గదిలోనే బాత్, టాయ్‌లెట్ అన్నీ ఉన్నాయి. హాట్ వాటర్ స్నానం చేశాడు. తరువాత కొద్దిసేపటికి మేరీ వచ్చింది. గుడ్‌మార్నింగ్ చెప్పింది. బాగా నిద్రపట్టిందా అనడిగింది. బ్రేక్‌ఫాస్టు తీసుకున్నాక బ్రౌన్‌గారు లండను నగరంలోని లెక్చర్లు జరిగే హాలుకి, అక్కడ ఆఫీసుకి తీసుకెళ్ళారు. దారిలో ఏదైనా హోటలులో ఉంటానన్నాడు శర్మ. బ్రౌన్‌గారు "డోంట్‌వర్రీ మై బాయ్. నీకు ఇచ్చే ఎలవెన్సు తక్కువ. ఇందులో నా సెల్ఫిష్ నెస్ కూడా ఉంది. మా మేరీకి తెలుగు మీద ఆసక్తి ఎక్కువ. నువ్వు మాకేమీ భారంకాదు. వుయ్ లవ్ అండ్ లైక్ ఇండియా అండ్ ఇండియన్ పీపుల్" అన్నారు. సంభాషణ అంతా ఇంగ్లీషులోనే జరిగింది. ప్రొఫెసరు బ్రౌన్ ఇంగ్లీషు ప్రొఫెసరు, ఆయన శర్మని ప్రొఫెసరు రాబర్ట్సుకి పరిచయం చేశారు. ప్రొఫెసరు రాబర్ట్సు శర్మని ఆప్యాయంగా పలకరించారు. తరువాత డెలిగేట్స్ రిజిస్ట్రేషను ఫార్మాలిటీస్ పూర్తయ్యాయి. శర్మకి ప్రోగ్రాం ఇచ్చారు. దాని ప్రకారం శర్మ ఆరు లెక్చర్లు చెప్పవలసి ఉంటుంది. మొదటి లెక్చరు ఇంకో రెండు రోజులలో మొదలవుతుంది. కాసేపు అక్కడ గడిపి తిరిగి వచ్చేశారు. దారిలో పోస్టాఫీసులో పోస్టేజి కొని యమునకి అడ్రసు ఇస్తూ ఉత్తరం రాశాడు శర్మ.

ఆ రాత్రి శర్మకి యమున గుర్తొచ్చింది. ఏంచేస్తూ ఉంటుందో. ఈ పాటికి వాళ్ళ ఇంట్లో ఉంటుంది. యమున తనని పెళ్ళిచూపుల్లోనే ఆకర్షించింది. వెంటనే పెళ్ళికి ఒప్పుకోవడం, పెళ్ళి అయిపోవడం జరిగింది. ఆరోజు తొలిరోజు. యమున మెల్లిగా నడుస్తూ గదిలోకి వచ్చింది. పువ్వులు గుబాళిస్తున్నాయి. తెల్లటి చీర. బుగ్గమీద చుక్క. "యమునా" అన్నాడు తను చెయ్యి పట్టుకుని. చెయ్యి కంపించింది. యమున తడబడింది. అంతా నిశ్శబ్దం. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు వినవచ్చాయి. తరువాత మెల్లిగా పక్కమీదకి తీసుకువచ్చాడు. పక్కనున్న స్వీట్సు తిన్నారు. ఆపైన గఢంగా పెనవేసుకుపోయారు. తరువాత యమున తనలో కరిగిపోయింది. యమున పారాణి పాదాలు తన గుండెలపై పెట్టుకున్నాడు. అదొక మధుర స్వప్నం... డెయిరీ టేబుల్ మీద పెట్టాడు.

లెక్చరు రోజున మేరీతో కలసి వెళ్ళాడు. ఏ సబ్జెక్టుకా సబ్జెక్టు గ్రూపులుగా విడిపోయారు. ప్రొ. రాబర్ట్సు శర్మని శ్రోతలకి పరిచయం చేశాడు. "హియర్ ఈజెయంగ్ మాన్ ఫ్రమ్ ఇండియా డాక్టర్ శర్మ, హు ఎన్‌లైటెన్సు యు ఆల్ ది ఫేమస్ వర్క్ ఆఫ్ కాళిదాస ది మేఘ సందేశ". శర్మ ఆశువుగా చెప్పడం ప్రారంభించాడు. "కశ్చిత్కాంతా విరహ గురుణా స్వాధికార ప్రమత్తః... యక్షుడు కుబేరునికి కమలములు పూజకి ఇచ్చేవాడు. తెల్లవారు జామున లేవటంవల్ల తొందరగా వెళ్ళవలసి వస్తుంది. అప్పటికి యక్షుడు యక్షిణి గాఢ పరిష్వంగనంలో ఉంటాడు. అందుకని కొన్ని పువ్వులు కోసి ఇంట్లో పెట్టుకున్నాడుట. ఒక కమలం మొగ్గగా ఉంది. అది పూజలో విచ్చుకొని అందులోని తుమ్మెద కుబేరుణ్ణి కరిచిందట. అందుకని కుబేరుడు శిక్ష విధించాడు. తనయొక్క విధిలో అపరాధంవల్ల ఎడబాటు కలిగింది ..." శర్మ మధ్య మధ్య వ్యాఖ్యానిస్తూ లెక్చరు పూర్తి చేశాడు. స్టాండింగ్ ఒవేషన్. మేరీ కళ్ళు సంభ్రమాశ్చర్యాలతో మెరిశాయి. "మిస్టర్ శర్మ, యువర్ లెక్చర్ మార్వెలస్, ఎన్‌ఛాంటింగ్" అంది. తరువాత ప్రొఫెసరు బ్రౌన్ దంపతులకి ఇంట్లో అదేపనిగా వర్ణించి చెప్పింది. బ్రౌన్ దంపతులు చాలా ఆనందించారు, ఇటువంటి కుర్రవాడికి అనుకోకుండా ఆశ్రయం ఇచ్చినందుకు. మళ్ళీ వారం రోజుల వరకూ లెక్చరు లేదు.

"బేబీ డాక్టరు శర్మకి లండను నగరం



## ఊర్పులు అక్కరలేని వరిపంట

ఇంతవరకు వరి వంగడాలను మొదట ఒకచోట నాటి మొలక ఎత్తిన తర్వాత వాటిని తిరిగి వరి పొలాలలో నాటే అలవాటు సర్వత్రా జరుగుతోంది. అయితే ఈ పద్ధతి మూలాన సహజంగా జాగు, ఎక్కువమంది కార్మికులను వినియోగించటం జరుగుతోంది.

జపానులో ఈ వరిసాగులో ఒక విప్లవాన్ని ఇప్పుడు సాధించారు. వరివంగడాలను నేరుగా వరి పొలాలలో జల్లి పంటను పండించవచ్చునని ఈ పరిశోధనవల్ల రుజువయింది. జపానులోని నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ అగ్రికల్చర్ సైన్సెస్ వారు ఒక చిత్రమైన ఉపాయాన్ని కనుగొన్నారు. మామూలు వరి వంగడానికి కాల్షియం పెరాక్సైడ్‌ను పూసి, నీటితో నిండిన వరిపొలాలలో వరి విత్తనాల్ని నేరుగా నాటవచ్చును. ఇలా వేయడం మూలాన నీరు, కాల్షియం పెరాక్సైడ్ ఒక దానితో మరొకటి రియాక్ట్ అయి నెమ్మదిగా ఆక్సిజన్ (ప్రాణవాయువు) ను ఉత్పత్తి చేసుంది. ఈ ఆక్సిజన్ మూలాన వరి విత్తనం దోషంలేకుండా పెరుగుతుంది. ఇకముందు ముందుగా నారు మళ్ళను తయారుచేసే శ్రమ పడనవసరం లేదు!

అంతా చూపించు' అని చెప్పారు బ్రౌనుగారు. ఆ మొదటి శని ఆదివారాలు మేరీ శర్మ కలిసి బకింగ్‌హామ్ పాలస్ చూశారు. బకింగ్‌హామ్ పాలస్ రాయల్ రెసిడెన్సు. బిల్డింగు గేట్లు అన్నీ మూసేసి ఉంటాయి. ఎంతోమంది టూరిస్టులు చూడ్డానికి వస్తారు. కోలాహలంగా ఉంటుంది. బిల్డింగుని పైనించే చూడాలి. ఎదురుగా తెల్లటి విగ్రహం విక్టోరియా మెమోరియల్. కొంచెందూరంలో సెంట్ జేమ్సుపార్కు. పార్కు పచ్చని చెట్లతో, పక్షులతో కళగా ఉంటుంది. అక్కడ చెరువుల్లో అనేకరకాల పక్షులు ఈతకొడుతూ కేరింతలడుతాయి. చిన్నపార్కు, ఎంతో ముద్దుగా ఉంటుంది. నవంబరు చివరి రోజులు జరుగుతున్నాయి. మధ్యాహ్నం మూడుగంటలకే చీకటిగా ఉంటుంది. సూర్యుడు ఎక్కడా కనిపించడు. మిట్ట మధ్యాహ్నం మన ఆంధ్రాలో సాయంత్రం అయిదు ఆరు గంటల మధ్య ఉండేపాటి వెలుతురు కనిపిస్తుంది. ఇల్లు చేరుకున్నాక మేరీ, శర్మ కాసేపు తెలుగు గురించి చర్చించారు. తన కొద్దిపాటి పరిజ్ఞానంతో ఎన్నో ప్రశ్న లడిగింది మేరీ. అన్నీ విడమరచి చెప్పాడు శర్మ. "మాస్టారూ మీ బెటర్‌హాఫ్ ఫోటో తీసుకొచ్చారా?" అడిగింది మేరీ. శర్మ చూపించాడు. "అచ్చు మేఘసందేశంలో యక్షిణిలాగే వుంది. టిపికల్ ఇండియన్ వుమన్"

## యక్షుని విరహం

అంది మేరీ "యు ఆర్ లక్కీ మిస్టర్ శర్మా" అంది ఆవేశంగా. "యస్ ఐయాం లక్కీ" అనుకున్నాడు మనస్సులో.

శర్మ మొదటి లెక్చరు గుర్తుకు తెచ్చుకున్నాడు. తను ఎలా చెప్పానని ఆత్మ పరిశీలన చేసుకున్నాడు. హీటర్ ఆన్ చేశాడు. రగ్గు కప్పుకున్నాడు. డైరీ తీసుకుని రాస్తున్నాడు... యమున. ఆమె పేరు కనీసం ఓ వెయ్యిసార్లన్నా స్మరించి ఉంటాడు. ఒకరోజు యమున స్నానం చేస్తోంది. టవల్ మరచిపోయింది. ఆరోజు ఆదివారం. తను ఇంట్లోనే వున్నాడు. "ఏమండీ టవలు మర్చిపోయాను ఇవ్వండి" అంది. ఓరగా బాత్‌రూం తలుపులు తెరిచింది తను టవలు అందిస్తూ యమునను అందుకున్నాడు. యమున అప్పటికే నగ్నంగా వుంది. "అబ్బ వెళ్ళండీ, వదలండీ" అని కసురుకుంది. గబుక్కున చీర చుట్టుకుంది. మొహం సిగ్గుతో ఎర్రగా కందింది. అబ్బ చూడనీవోయ్ నీ అందాలు అన్నాడు తను... "ఏమిటండీ" గారాలు పోయింది యమున. ఇప్పుడు ఏం చేస్తూ వుంటుందో. రాయప్రోలు వారు స్త్రీకి చెప్పిన ధృతి, సహనం, క్షమ అన్నీ యమునలో వున్నాయి. తను సరిగ్గానే యమునను ఎంచుకున్నాడు... శర్మ రాయడం ముగించి భారంగా నిట్టూర్పు విడుచుకున్నాడు.

శర్మ లెక్చరు చెప్తున్నాడు. "ప్రత్యాసన్నే నభసి దయితా జీవితాలంబ నార్థీ... ఆ యక్షుడు శ్రావణమాసము సమీపించినది కాగా ప్రియురాలి జీవితము నిలుపకోరుచున్నవాడై మేఘునిచేత తన క్షేమ వార్త పంపువాడగుచు, నూతనములైన కొండమల్లె పువ్వులచేత చేయబడిన పూజగల ఆ మేఘుని కొరకు ప్రీతిపూర్వకమైన పలుకులతో స్వాగత వచనముల సంతోషించిన వాడగుచు పలికెను మనస్సును కుదుట పరచుకొని ఏమి చేశాడో చెప్తున్నాడు. విరహాలకు శ్రావణం దుస్సహం..." లెక్చరు చివరన మళ్ళీ డిస్కషన్ ఎంతోమంది లెక్చరర్లు ఎటెండయ్యారు. అమెరికా విస్కాన్సిన్, మరి యితర యూనివర్సిటీల నుంచి వచ్చారు డెలిగేట్సు. చివరిలో ప్రశ్నలు అడుగుతున్నారు. "మిస్టర్ శర్మ ఇఫ్ యు డోంట్ మైండ్ ఎ పెర్సనల్ క్వశ్చన్. వై యు హేవ్ ఛోసెన్ మేఘసందేశ ఫర్ యువర్ పి. హెచ్. డి.?" శర్మ చెప్తున్నాడు. "కాళిదాసు గొప్ప కవి. ఎన్నో కావ్యాలు రాశాడు. అందులో శాకుంతలం, మేఘసందేశం, రఘువంశం మొదలైనవి. కాళిదాసు స్త్రీకి గౌరవప్రదమైన స్థానం కల్పించాడు. శాకుంతలంలో శకుంతలను ముగ్ధగా, రఘువంశంలో సుదక్షిణను పవిత్రంగానూ చూపించాడు. మేఘసందేశాన్ని జీవితానికి దగ్గరగా మలిచాడు. ప్రతీ కథలో నాయకీ నాయకులుంటారు. ప్రతి వారికి అటువంటి పరిస్థితులేర్పడుతాయి. విశేషించి మేఘ వర్ణన, ప్రకృతి వర్ణన, గంభీరనది, ఉజ్జయిని, చిత్రకూటం. రామగిరి ఆశ్రమం, అలకా పట్టణం, యక్షిణి విరహం ఇవన్నీ ఉదాత్తమగు భాగాలు. అందుకే మేఘ సందేశం నాకు ఎక్కువ ఇష్టం. ఉపమా కాళిదాసస్య. కాళిదాస గిరాసారం, కాళిదాస సరస్వతీ... అన్నాడు మల్లినాథుడు. కాళిదాసుకి తెలిసినట్టి భావములు, పదములూ అవి మరెవరికీ తెలియవు. కాళిదాసుకీ, బ్రహ్మకీ, సరస్వతికీ తప్ప మాటోటి వాళ్ళకు తెలియవు..." శర్మ ఆవేశంగా చెప్పాడు. తిరిగి చప్పట్లు.

ఆ వీకెండు మేరీ శర్మని మొదటగా ట్రాఫల్‌గర్ స్క్వేరుకి తీసుకెళ్ళింది. అక్కడ ధాన్యం కొని పావురాలకు పెట్టారు.

పావురాలు గుంపులు గుంపులుగా వచ్చి వాలాయి. తరువాత లండన్ బ్రిడ్జి, టవర్ హౌస్ చూశారు. అక్కడ కోహినూరు వజ్రాన్ని చూశారు. లండను నగరంలో సిటీబస్సులేకాక ట్యూబ్ ట్రయిన్సు కూడా ఉన్నాయి. అవి అండర్ గ్రౌండ్ ట్రెయిన్సు. చాలా కన్వీనియంటుగా ఉంటాయి. "మిస్టర్ శర్మా! మీరు ఏక్టివ్‌గా పార్టిసిపేట్ చేయటంలేదు. మీ యమున గురించి ఆలోచిస్తున్నారా?" అంది మేరీ. శర్మ మూగగా నవ్వి ఊరుకున్నాడు.

ఆ రాత్రి శర్మ గదిలో డైరీ రాస్తున్నాడు ... యమున అనుక్షణం గుర్తుకొస్తోంది. యక్షునికైతే మేఘుడున్నాడు. తనకెవరున్నారు తన ప్రియురాలికి సందేశం అందించడానికి. ఒక ఆదివారం యమున తనూ సింహాచలం వెళ్లారు. కొండమీద సంపెగ మాలలు తురిమాడు యమున జడలో. అక్కడున్న సంపెంగ వృక్షాల దగ్గర యమునకి ఫొటో తీశాడు. గుళ్ళో పూజారి సుపుత్ర ప్రాప్తిరస్తు అని దీవించారు. కొండ ఎక్కేటప్పుడు బస్సులో వెళ్లారు, వచ్చేటప్పుడు మెట్ల మీదుగా దిగివచ్చారు. చెంగు పట్టాలేసుకుని [illegible] ఆకాశ గంగని స్పృశించారు. దిగడంలో యమున చీర కుచ్చెళ్లు అడ్డుకుని తడబడింది మెట్ల మీద. కొంచెం ముందుగా వెళుతున్న తను గబుక్కున యమునను పట్టుకుని దీర్ఘంగా ఊపిరి పీల్చుకున్నాడు. కొద్దిలో యమున దొర్లి పడిపోయేదే. గండం గడిచింది. యమున ఆ కౌగిలింతలో నలిగిపోయింది.

రోజులు గడుస్తున్నాయి. శర్మకి భారంగా ఉన్నాయి. మేరీతో కలిసి లండను లోని అన్ని ప్రదేశాలు చూస్తున్నాడు. ఒకసారి మేడమ్ టుస్సార్డ్స్ మ్యూజియమ్ చూశారు. అందులో అన్నీ మైనంతో చేసిన బొమ్మలే. ఇందిరాగాంధీ, క్రికెటర్ సోబర్సు, ఫుట్‌బాల్ ప్లేయరు పీలే మొదలైన వాళ్ళ బొమ్మలు. వాటిలో విశేషమేమంటే ఆయా వ్యక్తులే అక్కడికొచ్చారా అన్నంత నేచురల్‌గా ఉంటాయి. వాటి ఫినిష్ అంత బాగుంటుంది. ఒక చోట ఒక మనిషి లాఠీతో నుంచుని ఉన్నాడు. శర్మ ఆశ్చర్యంగా

(45వ పేజీ చూడండి)

# వంటలు

## అమృత ఫలములు

కావలసిన వస్తువులు : 1 కొబ్బరికాయ, పిడికెడు బియ్యం, అరసోల పంచదార, ఏలకులు, జీడిపప్పు, 2 స్పూన నెయ్యి.

చేసే విధానం : కొబ్బరి తురిమి పిడికెడు బియ్యం వేసి బాగా రుబ్బి పాలు తీసుకోవాలి. ఈ పాలలో పంచదార వేసి స్టౌమీద సన్నసెగతో ఉడకనివ్వాలి అడుగంటకుండా మధ్య మధ్య కలుపుతూ ఉండాలి. కొంచెం దగ్గర పడ్డాక ఏలకుల పొడి. జీడిపప్పు వేసి నెయ్యి వేసి కదపాలి. ముద్దగా ఉడికిన తరువాత(చేతికి అంటుకోకుండా ఉన్నప్పుడు) దించివేసుకోవాలి. ఒక పళ్ళెమునకు నూనె రాసి, అందులో ఈ ముద్ద పోసి, చేతితో సాపు చేసి, డైమండ్ ఆకారంలో ముక్కలు కోసుకుని, తినేటే చాల రుచిగా ఉంటుంది ఒక్కరాత్రి కన్నా ఎక్కువ నిలవ ఉండదు

— పెద్దింటి స్వర్ణలత

## మొక్కజొన్న కేక్

కావలసినవి : లేత మొక్కజొన్న పొత్తులు 4, పెసరపప్పు 1 కప్పు, చక్కెర 3 కప్పులు, నెయ్యి 150 గ్రా, యాలకులు 4 లేక 5, జీడిపప్పు కొద్దిగా.

తయారీ విధానము : మొక్కజొన్న పొత్తుల నుంచి గింజలు వలిచి రోటిలో వేసి గట్టిగా రుబ్బి ఓ పాత్రలో పెట్టుకోవాలి. పెసరపప్పు దోరగా వేయించి, రవ్వగా విసిరి వుంచుకోవాలి స్టౌ మీద మందపాటి గిన్నె పెట్టి చక్కెర వేసి కొద్దిగా నీరు పోయాలి. తీగపాకం వచ్చాక జొన్నముద్ద వేసి ఉండలు లేకుండా కలియపెట్టాలి. తర్వాత పెసర రవ్వ కూడా వేసి కలిపి నెయ్యిపోసి అడుగంటకుండా కలుపుతూ ఉండాలి. నెయ్యి అంతా యిగిరి మిశ్రమం కుదుట పడ్డాక పళ్ళెంలో పోసి అన్నివైపులా సమానంగా పరచి గోళీకుండ చల్లాలి. బిళ్ళలుగా కోసి ఒక్కొక్క బిళ్ళపై ఒక్కొక్క జీడిపప్పు అంటించాలి.

— వల్లిశ్రీ నాగరాజు

( గత సంచిక తరువాయి )




























[ఇంకా ఉంది]




హరికృష్ణ తల్లితో రహస్యంగా అన్నాడు.

"అమ్మా! కాలేజీ ముఖం చూడక, ఇంట్లోనే కూర్చుని ఇంటర్ బి. ఏ. చదవడంతో అది పిరికిపక్షిగా తయారైందమ్మా! ప్రతిదీ అనుమానమే! ప్రతిదానికీ భయమే! ఆ పిరికితనాన్నీ, భయాన్నీ వదలగొట్టకుండా దాన్ని ఉద్యోగానికి పంపితే, అదే బాధపడుతుందమ్మా! నేను బయట ప్రపంచంలో తిరిగేవాడ్ని."

"ఏంటో, అంతా గందరగోళం! అది సరే! మధ్యాహ్నం పుండరీకాక్షయ్య వచ్చాడు."

"చెప్పేనా? పిల్ల నచ్చలేదని?"

"ఎలా చెప్పేరా?"

"బాగుంది! నచ్చకపోతే నచ్చలేదని చెప్పాలి గాని, మొహమాటం పడితే ఎలాగా?"

"నిజమే! కానీ ఆయనగారు రావడం రావడం ముందు కాళ్లకు బంధాలువేస్తూ వచ్చాడు. రాగానే, చెల్లెమ్మా! విజయవాడలో ఓ లెక్చరర్ సంబంధం ఉంది మన మల్లికకు అన్నాడు. దాంతో నేను కుండ బద్దలుకొట్టినట్లుగా చెప్పలేకపోయాను."

"ఆ సంబంధం గురించి వివరాలు చెప్పాడా?"

"లేదు!"

"అమ్మా! వాళ్లు మోసగాళ్లు! పిల్లకు రంగేసి రాత్రివూట చూపడంతోనే వారి నిజాయితీ వ్యక్తం అయింది. మనకు ఆ సంబంధం వద్దమ్మా! ఆయన నిజంగా మంచివాడే అయితే, ఆ లెక్చరర్ సంబంధం వివరాలు తెలిపితే ప్రయత్నిద్దాం. లేకుంటే కాదు!"

"అడిగానురా! కానీ ఆయనగారు లెక్చరర్ సంబంధం వివరాలు అడిగితే, అవన్నీ నాకొదులు చెల్లెమ్మా! నేను నీ తరపున అన్నీ సానుకూల పరుస్తాను. ముందు అబ్బాయి ఏమన్నాడో చెప్పండి! అన్నాడు."

"నీవేమన్నావమ్మా?"

"అబ్బాయి ఏ సంగతీ తేల్చి చెప్పలేదు. అమ్మాయి భారీగా ఉంది అన్నాడు. అని అన్నాను!"

"పొరబాటు చేశావమ్మా! నచ్చలేదని చెబితే పోయేది!"

"ఎట్లా పోతుందిరా! నీ పెండ్లి అడ్డం పెట్టుకుని, ఆ మల్లిక పెండ్లిగూడా చేసేద్దామనుకుంటున్నాను. అట్లయితే నా ప్రాణానికి హాయి! నీవుగూడా నేను చెప్పినట్లు వింటావని అనుకున్నాను. మళ్లీ ఏంటిరా పేచీలు! ఆ పుండరీకాక్షయ్య కూతుర్ని చేసుకోరాదూ? ఆయన బాధ్యత వహిస్తే, మల్లిక పెండ్లిగూడా అయిపోతుంది."

( గత సంచిక తరువాయి )

"అమ్మా! ఎలా నచ్చేది? పిల్ల నచ్చకపోయినా చేసుకోమంటావా?"

"నచ్చడం అంటే, ఎంతకులే నాయనా? ఏదో కులమింటి కోతి! నీవు నచ్చిన పిల్లనే నీవు చేసుకుంటే మల్లిక వచ్చినవాడ్ని తీసుకురాగలవా? కట్నం ఇవ్వగలవా? పెండ్లి చేయగలవా? ఏదో మీ మేలుకోరి చెప్పాను. నాకు అంతకంటే మార్గం లేదు. ఈ లోపల ఈ సంగతులు మీ మామయ్యకు తెలిస్తే, వాడేం చేస్తాడోనని గాభరాపడి ఛస్తున్నాను. నా మాట వినునాయనా! ఆ పుండరీకాక్షయ్య సంబంధం వప్పుకో!" అన్నది భ్రమరాంబ.

హరికృష్ణ విసుగ్గా కుర్చీలోనుండి లేచి, "అలా తిరిగొస్తానమ్మా!" అంటూ వాకిట్లోకి వెళ్లిపోయాడు.

బజార్లోకి వచ్చి, రింగురోడ్డు పట్టుకుని రోడ్డు ప్రక్కగా నడిచి వెళ్తున్నాడు హరికృష్ణ, ఆలోచించుకుంటూ.

ఈ పుండరీకాక్షయ్య కూతురి సంబంధం తనకు ప్రాణాంతకంగా పరిణమించింది. ఆ పిల్ల తనకు నచ్చుతుందేమో, నిశ్చింతగా ఆమెను చేసుకుంటే పుండరీకాక్షయ్యే మల్లికకు పెండ్లి సంబంధం చూసి పెండ్లి చేయిస్తాడు. ఆవిధంగా అమ్మ కోర్కెను తీర్చినవాడవుతాడు తను అనుకున్నాడు. రంగూ మేకప్పులూ ఎలావుండి ఏడ్చినా, ఆ ముఖంఅన్నా టాలరబుల్‌గా వుండివుంటే సరేననేవాడు. ఆమె ముఖం చూస్తే తనకు రిపల్షన్ లాంటిది కలిగింది ఎందువల్ల? ఏమో ఆ బ్యూటీ ముఖం చూస్తే తన మనస్సు యెందుకు ఆహ్లాదంగా వుంది? ఏమో!

---

***జరిగిన కథ-5 :*** సంధ్య, స్వరూపరాణి స్నేహితురాండ్రు. సంధ్య గుంటూరులో టైపిస్టుగా పనిచేస్తోంది. ఆరోజు స్వరూపరాణి పెండ్లిచూపులు అవటంవలన రోజాకంటే ముందుగా విజయవాడకు వస్తున్న సంధ్య ట్రయిన్‌లో పెండ్లికొడుకు హరికృష్ణను చూసి, అతను స్వరూపరాణికి తగడను కొంటుంది. అతన్ని తన ప్రక్కన ఊహించుకొని ఆనందిస్తుంది. హరికృష్ణ విషయంలో ఎటూ తేల్చి చెప్పలేకపోతుంది స్వరూపరాణి. సంధ్య హరికృష్ణ ఇంటికి వెళ్ళి అతని తల్లి భ్రమరాంబను, చెల్లి మల్లికనీ తన వాక్చాతుర్యంతో ఆకట్టుకొంటుంది. గిరిజ తన జీవితంలో జరిగిన మరుపురాని సంఘటనను ఒక కథగా వ్రాసి చదవమని సంధ్యకిస్తుంది. ఆ కథను చదివిన సంధ్య బాధపడి, దాని ఆఖరు పేరాను కొంచెము మార్చి వారపత్రికకు పంపిస్తుంది.

---

అప్పటికే తను అమ్మకు చెప్పాడు. ఇప్పుడు బ్యాంకులో ఐదువేలున్నాయి కదా? రెండు మూడేళ్ళు సి. టి. డి. కట్టి పదివేలు చేసి, మల్లిక పెండ్లిచేసి తను పెండ్లి చేసుకుంటానంటే అమ్మ అలా కాదంటుంది. ఏటికేడు పైనబడేకొద్దీ మామయ్య ఇక్కడికిగూడా వచ్చి గలభా చేస్తాడు పెళ్ళిళ్ళు కావు అంటుంది అమ్మ, మామయ్య అంటే అంత భయపడుతుందెందుకో అర్థంగాదు! ఆయన ఇక్కడికీ వచ్చి తమపైన దుష్ప్రచారం చేస్తే యెవ్వరు నమ్ముతారు ఇక్కడ?

ఏమైనా మామయ్య చాలా అసాధ్యుడు. ఒకసారి అనంతపురంలో ఒక ఇచ్చిపుచ్చుకునే సంబంధం మాట్లాడించింది అమ్మ తమలాంటి దౌర్భాగ్యుడికే ఒక కూతురూ, కొడుకూ వున్నారు. ఆ కూతుర్ని తను చేసుకుంటే కొడుకు మల్లికను చేసుకునేలాగా నిర్ణయం అయిపోయింది. తాంబూలాలు పుచ్చుకున్నారు. ముహూర్తాలు గూడా పెట్టుకున్నారు. కానీ హఠాత్తుగా ఆ అనంతపురం పెద్దమనిషి మీ సంబంధాలు మాకు అక్కర్లేదు అని జాబు వ్రాశాడు. అమ్మ కుప్పకూలిపోయింది. తనకు ఆ పెద్దమనిషిమీద మండిపోయింది. అనంతపురం వెళ్ళి ఆ పెద్దమనిషిని నిలదీసి అడిగాడు. "ఏమయ్యా! ఏంటీ పనులు? ఎందువల్ల మీకు మా సంబంధం పనికిరాకుండాపోయింది?" అని అడిగాడు. కానీ వాడు ఒకటే సమాధానం "మీ సంబంధాలు మాకొద్దు" అని. ఇదంతా మామయ్య మంత్రాంగం అంటుంది అమ్మ. మామయ్య అంత ఎఫెక్టివ్‌గా మంత్రాంగం యెలా వేయగలడో అర్థంకాలేదు. ఆ తరువాత తనకు ఒకటి రెండు సంబంధాలు వచ్చాయిగాని అంతా మిస్టీరియస్‌గా తప్పుకున్నారు.

అంటే మామయ్య ఒకవిధంగా తనను బ్లాక్‌మెయిల్ చేస్తున్నాడు. తన మూగి కొడుక్కి మల్లికను ఇచ్చి పెండ్లి చేస్తేగాని తనకు పెండ్లి కానివ్వడు. కానీ ఈ గుంటూరుదాకా కూడా వాడి కబంధహస్తం వస్తుందా? ఇంతవరకు రాలేదు. ఇకముందు వస్తుందా? ఆఖరుకు ఇప్పుడు వెంటబడే పుండరీకాక్షయ్య గూడా పారిపోతాడా మామయ్య దెబ్బకు?

మామయ్య, తమకొచ్చే సంబంధాలవారితో ఏం చెబుతుంటాడు? తన కారెక్టర్ మంచిది గాదనా? మల్లిక కారెక్టర్ మంచిదిగాదనా? ఒకవేళ చెప్పినా ఈ పెండ్లిసంబంధాల కొచ్చే బడుద్దాయిలు గుడ్డిగా మామయ్య చెప్పింది నమ్మేయడమేనా? పుండరీకాక్షయ్య కూతుర్ని చేసుకుంటే ఆయన వెంటనే మల్లికకు గూడా పెండ్లి చేయిస్తాడు. అమ్మ ఆశలు తీరుతాయి. కానీ తన గతి? నచ్చని పిల్లతో జీవితాంతం కాపురం చేయగలడా? ప్చ్! ఈ చిక్కునుండి తను యెలా విడివడగలడు?



'బ్యూటీ' లాంటి పిల్ల తన భార్య అయితే? వండర్‌ఫుల్‌గా వుంటుంది. బ్యూటీలాంటి పిల్ల భార్య హోదాలో ఇంట్లో తిరుగుతున్నా, పక్కన నిలబడి సినిమా కొచ్చినా అదొక అందం, సంతోషం. ఇంతకీ బ్యూటీకి పెండ్లి అయిందా? ఆమె మెడలోని దండకున్నది మంగళసూత్రమా? లాకెట్టా? అయినా మరోమారు టాస్‌వేసి చూదాం! అనుకుని హరికృష్ణ జేబులో నుండి అర్ధరూపాయి నాణేన్ని తీసి పైకి విసిరాడు. అది క్రిందకు వస్తూవుంటే పట్టుకోబోయాడు కానీ, నాణెం వ్రేళ్ళ చివరకు తగిలి ఎగిరి అవతల పడింది ఇసుకలో. హరికృష్ణ ఆతృతగా ఇసుకలో పడ్డ నాణేన్ని చూశాడు. అది నిలువుగా ఇసుకలో గుచ్చుకుని వుంది. 'నాన్సెన్స్!' అనుకుని నాణేన్ని తీసుకుని జేబులో వేసుకున్నాడు.

ఇలా లాభంలేదు. రేపు లెవల్‌క్రాసింగ్ దగ్గర ఎదురుపడ్డప్పుడు ఆమెతో —

'నమస్తే మేడం!' అనాలి.

'నమస్తే!' అని అనవచ్చు ఆమె.

'మీకు ... పెండ్లైందాండీ?' అని అంటే? సమాధానం చెబుతుందా? 'షటప్!' అంటుందా? 'షటప్!' అనియే అనవచ్చు! లేకుంటే ఆమెకు కనబడకుండా ఆమె వెంటనే వెళ్లి సంగతి తేల్చుకుంటే? దోవలోనే పోలీస్ స్టేషన్ వుంది. ఆమె కనుక్కుందంటే ఈవ్ టీజింగ్ కింద జైల్లో పారేస్తారు! కాకపోతే తనను పోకిరీ వాడనుకుంటుంది ఆ పిల్ల!

ప్చ్! ఎటుచూసినా చుక్కెదురౌతున్నది. ఒకవేళ బ్యూటీ అవివాహితయేననుకో! తను తంటాలుపడి ఆమె దృష్టిలో పడుతాడు. ప్రేమిస్తాడు. పెండ్లి చేసుకుంటాడు. ఇది ప్రేమ వివాహం గనుక డబ్బుతో పని వుండదు. మరి అమ్మ ఆమోదిస్తుందా? యెలా ఆమోదిస్తుంది? మల్లికకు పెండ్లి గాకుండా తను పెండ్లి చేసుకుంటే ఒక్కనాటికీ అమ్మ ఆమోదించదు. ఆ చేత్తోనే మల్లికకు గూడా పెండ్లి చేయమంటుంది? వున్నది ఐదువేలే! ఐదువేలతో పెండ్లి అవుతుందా? తను మల్లికకు సంబంధాలు చూడగలడా? వాళ్ళు కట్నం అడిగితే? వెర్రిముఖం వేయక తప్పదు. అప్పుడు అమ్మ తనను కృతఘ్నుడంటుంది. నా స్వార్థం నేను చూసుకున్నానంటుంది. అమ్మ, చెల్లి అసంతృప్తిగా తనంటే విముఖంగా వుంటే, తన ప్రేయసితో సంసారం సక్రమంగా జరుగుతుందా? ప్చ్! జరుగదు. పెండ్లామో, తల్లీ, చెల్లియో తేల్చుకోవలసిన సన్నివేశం రావచ్చు. ఎవర్ని వదులుకుని ఎవర్నాదరించినా లైఫ్ ట్రాజడీయే!

ఇదంతా జరిగేపని కాదు. ఎన్నాళ్ళైనా మల్లిక పెండ్లి చేశాకే తన పెండ్లి. అదే ఉత్తమ మార్గం. ఆ విషయం అమ్మకు నచ్చచెప్పాలి. ఇక మూడేండ్లు కష్టపడి సంపాదించి, ఖర్చులు తగ్గించుకుని సేవ్ చేస్తే వున్నదానితో సేవ్‌చేసిన దానితో మల్లిక పెండ్లి చేయవచ్చు.

ఇలా విషాదంగా భావించుకుని హరికృష్ణ ఇల్లు చేరుకున్నాడు.

ఇంట్లో కాలు పెడుతూవుండగనే మల్లిక విప్పారిన ముఖంతో అప్లికేషన్ ఫారాలను హరికృష్ణ ముఖంముందు అటూ ఇటూ త్రిప్పుతూ "ఇదిగో పూర్తిచేయబడిన అప్లికేషన్ ఫాం! ఏంటో ... పెద్ద ... కాస్త హెల్ప్ చేయవయ్యా అంటే పెద్ద ఎచ్చులుగా ట్టావ్! ఇదిగో అప్లికేషన్ ఫాం! అన్ని కాలమ్స్ పూర్తిచేశాను. కావాలంటే చూసుకో!" అన్నది.

హరికృష్ణ ఆశ్చర్యంగా అప్లికేషన్ ఫారాలను కరెంటు దీపం వెలుగున చూశాడు. శ్రద్ధగా పరిశీలించాడు. ఫారం అంతా కరెక్ట్‌గా ఫిలప్ చేయబడి వుంది.

"కంగ్రాట్స్! మల్లికా! అంతా కరెక్ట్‌గా వుంది. ఇక ఫీజ్ కట్టడం, ఫోటోలు తీయించడం, నీ సర్టిఫికేట్‌కు ట్రూ కాపీలు తీయించడం నా కొదిలేయ్! రేపు పొద్దున్నే స్టూడియో కెళ్లి ఫోటో తీయిస్తాను."

"హాఁ! చూశావా! ఒక్క తప్పులేకుండా ఫిలప్ చేశాను."

"ఒప్పుకున్నాం మల్లికగారూ! కాని తెలిసివుండి నన్నెందు కడిగావు?"

"ఏదో మొదటిసారిగదా — అని!"

"అప్లికేషన్ ఫిలప్ చేయడం తెలిక అని నాకు తెలుసు. అయినా అసలు నీవు అందులో

బుర్ర పెట్టకుండా నాచేత చేయిద్దాం అని అనుకున్నావు గనుక నేను సాయం చెయ్యలేను. అలాగే ఏ సమస్య అయినా ఆలోచిస్తే దానికి పరిష్కారం చిక్కకపోదు. అందువల్ల నీ సమస్య గానీ, నా సమస్యగానీ, మన కుటుంబ సమస్యగానీ నీవు గూడా ఆలోచించాలి. నీ ఆలోచనలు నాకు చెప్పాలి. అంతేగాని, ఆలోచించే పని మా నెత్తిన పారేసి మేం చెప్పినట్టల్లా బుర్రాడించగూడదు తెలుసా ?''

''అవును నుకో! నేనేం చెప్పినా నీవు చిన్నపిల్లవు నీకేం తెలీదు అని కొట్టిపారేస్తుంది అమ్మ !''

''నేను కొట్టిపారేయమగదా! ఒకవేళ నీవు చూపిన ఆలోచన మాకు నచ్చలేదనుకో! ఫలానా కారణంవల్ల నచ్చలేదని చెబుతాం. అంతేకాని, మేము ఆమోదించలేదని నీవు ఆలోచించకుండావుండడం బాగాలేదు. ఇప్పుడు మన సమస్యను గురించి ఆలోచించు. నీ ఆలోచనలేంటో నాకు చెప్పు.''

''మన సమస్యలా !''

''అవును మల్లికా! మామయ్య భయంవల్ల అమ్మ మన పెండ్లి యెంత త్వరగా చేస్తే అంత మంచిదని అనుకుంటున్నది. కానీ, నిజంగా మన పెండ్లిండ్లు అయిపోతే అమ్మకు సంతోషం కలుగుతుందా ? మనకు సంతోషం కలుగుతుందా? ఆ పెండ్లిండ్లవల్ల మనం బాధపడుతుంటే పెండ్లిడ్లు చేసినందువల్ల తన బాధ్యతలు తీరాయని అమ్మ ఆనందించగలదా ? చూడు! ఆ విజయవాడ పిల్ల నాకు బొత్తిగా నచ్చలేదు. బహుశః ఇన్‌కాంపెటిబిలిటీ అనుకుంటాను అయినా ఆ పిల్లను నేను నచ్చలేదని అమ్మకు కొరవగా వుంది. నేను గనుక ఆ పెండ్లి చేసుకుంటే ఆ వచ్చే కట్నం డబ్బులతో నీకో లెక్చరర్ సంబంధం తెస్తానంటున్నాడు పుండరీకాక్షయ్య. మరి మనం ఇట్లా వివాహాలు చేసుకుంటే బాధలు పడుతామా లేదా ? అమ్మ చెప్పినట్లు చేయడం మంచిదా ? ఆలోచించి చెప్పు'' అన్నాడు హరికృష్ణ చాలా సీరియస్‌గా.

తనకు ఇంత గౌరవం ఇచ్చి, తన సలహాను అన్నయ్య అడుగడం మల్లికకు గుర్తులేదు. అందుకనే ఆశ్చర్యంగా అడిగింది. ''అన్నయ్యా! నిజంగా నా ఆలోచనలకు విలువనిచ్చి గౌరవిస్తావా ?''

''అవునమ్మా! నీవు చిన్నపిల్లవుకావని నాకు తెలుసు. గ్రాడ్యుయేట్‌వి! నా అంత చదువు నీకుంది. నాకు ప్రపంచానుభవం యెక్కువైతే నీకు స్త్రీగా కొన్నిరకాల ఆలోచనలలో ప్రత్యేకమైన ప్రజ్ఞ వుంటుంది. కనుక ఆలోచించు. మనం కర్నూలు విడిచి ఇంతదూరం వచ్చాము. ఇక్కడ మన్న మామయ్య ఏమీ చెయ్యలేడు. ఒకవేళ ఇక్కడా ఏదైనా మన్ని గురించి దుష్ప్రచారం చేస్తే ఆయనకు ప్రతిగా మనం దుష్ప్రచారం చెయ్యలేము గనుక వైజాగ్ వెళ్లిపోదాం. లేకుంటే ఏ నాగపూరో, అస్సామో వెళ్దాం. కానీ, అనవసరపు భయాలను పెట్టుకున్న అమ్మ మాటలు వింటే



## స్వయంవరం

మనకు మంచిదో కాదో నీవూ ఆలోచించు'' అన్నాడు హరికృష్ణ.

''అలాగే అన్నయ్యా! నాకూ ఈ పెళ్ళిళ్ళ గొడవలమీద కొన్ని అయిడియాలున్నాయి. చెబితే ఏమంటావోనని నాలోనే దాచుకున్నాను. పెద్దలు మీరు యెలా చెబుతే అలా నడుచుకుందామను కున్నాను. ఇంకా బాగా ఆలోచించి నా ఆలోచనలను నీకు చెబుతాను.''

''దట్స్ గుడ్ గర్ల్!''

''పద! స్నానం చేదువుగాని. నేను పోయి నీళ్ళు పెడుతాను'' అంటూ ఇంట్లోకి దారితీసింది మల్లిక.

మల్లిక తన ఆలోచనాసరళి భారాన్ని వహించ డానికి సంసిద్ధతను తెలియజేసినందున హరికృష్ణకు వెయ్యి ఏనుగుల బలం వచ్చింది.

హరికృష్ణ స్నానంచేసి వంటిట్లో భ్రమరాంబ

### రచయితలకు మనవి

కథలు పంపేవారుకూడా విడిగా తపాలా బిళ్లలు పంపటం, లేదా కథ పంపిన కొంత కాలానికి తపాలా బిళ్లలు పంపటం చేయవద్దని మనవి. కథల పరిశీలనకు ఆరు నుంచి పది వారాలు పట్టవచ్చును కథ ప్రచురణామోదం పొందిన వెంటనే రచయితకు కార్డు ద్వారా తెలియజేస్తాము. నవలల విషయంలో ఏ విషయం తెలియటానికి నాలుగు మాసాలు పట్టవచ్చును. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదని మరోసారి మనవిచేస్తూ - మాతో రచయితలంతా పై నిబంధనల విషయంలో సహకరించాలని కోరుతున్నాము. కలర్ ట్రాన్స్‌పెరెన్సీలు పంపేవారు గూడా తిరుగు టపా కవరు పెట్టడం అవసరం. సం॥

పెట్టిన కంచం ముందు కూర్చున్నాడు. ప్రక్కనే మల్లిక గూడా కంచం పెట్టుకొని కూర్చుంది.

''అమ్మా! ఓ సంగతి చెప్పడం మర్చిపోయాను. ఇవ్వాళ ఆఫీసుకు ఒకాయన వచ్చాడు. ఆయన విజయవాడలో సెంట్రల్ ఎక్సైజులో పెద్ద ఆఫీసరట! తన మరదల్ని నాకు యిస్తాం అంటున్నారు. ఆయన భార్య ఈ వూళ్ళో లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తున్నదట. ఆమె రోజా రైలులో ఈ ఊరొచ్చి ఉద్యోగం చేసుకుని విజయవాడ వెళ్తుందట. మా అమ్మతో మాట్లాడండి అన్ని విషయాలూ అని చెప్పాను'' అన్నాడు హరికృష్ణ.

''అయితే ఇంకో కొత్త సంబంధం వచ్చిందన్నమాట! నాయనా హరీ! ఆ విజయవాడ సంబంధంమీద నాకు మనసు పోలేదురా! ఆ పుండరీకాక్షయ్య యెంత మంచివాడు ? తోడబుట్టిన నాడికంటే యెంత మిన్నగా మాట్లాడాడు ? నాయనా! పెండ్లి అంటే కేవలం అమ్మాయి నచ్చడమే కాదు! ఇంకా అనేక విషయాలు చూడాలి! మనం, పెద్దరిక్కు ఉన్నవాళ్లంకాదు! మల్లిక పెండ్లి చేయాలంటే, నీవల్లా కాదు! నావల్లాకాదు! ఆ పుండరీకాక్షయ్యలాటి కార్యసాధకులవల్లనే పెండ్లి జరుగాలి! కాబట్టి నాయనా! ఆ పుండరీకాక్షయ్య కూతుర్ని పెండ్లి చేసుకో!''

హరికృష్ణకు అన్నం సహించడం మానివేసింది. పుండరీకాక్షయ్య కూతురు మనసులో మెదిలాక, ఒక్క ముద్ద లోపలికి వెళ్లడంలేదు. హరికృష్ణ పుట్టి బుద్ధి ఎరిగింది మొదలు తల్లి ఆజ్ఞలను శిరసావహించాడు. తల్లి ఆజ్ఞలను, సలహాలనూ ఎలాంటి అరమరికలూ లేకుండా పాటించడమే అతడికి తెలుసును. జీవితంలో మొదటిసారిగా తల్లి సలహాలు తన ఆలోచనలకంటే భిన్నంగా వున్నాయి.

''అమ్మా! నీవు చెప్పింది సబబుగానే వుంది. అయినా పుండరీకాక్షయ్య కూతురు నాకు నచ్చలేదు ''

''నచ్చలేదంటే, ఎందుకు నచ్చలేదురా ! ?''

''అలా నిలదీసి అడిగితే ఏం చెప్పాలి ?''

''ఆ పిల్లకు కన్నూ, కాలూ లోపం ఉందా?''

''అలాంటిదేమీ కాదు ''

''మరి చదువు, సాములు ఉన్నాయి. కట్నం ఇస్తారు. నాయనా! నా మాట విను! మనం ముందూ వెనుకా లేనివాళ్లం ఏదో భగవంతుడి దయవల్ల, ఆ పుండరీకాక్షయ్య ఇంటికొచ్చాడు పిల్లనిస్తానని ''

''అవన్నీ నిజమేనమ్మా! ఆ పిల్ల ముఖంలో నుగరాయుడి లక్షణాలు కనిపిస్తున్నాయమ్మా!''

''నీ మూతి! పిల్ల నచ్చలేదని చెప్పదల్చుకున్న వాళ్లకు, అట్లాగే లేనిపోని భావాలు కలుగుతాయి!''

''అమ్మా! నీవు పొరబడుతున్నావు! నచ్చుదల్చుకోనివాడిని, అంత దూరం ఎందుకు వెళ్తాను? అమ్మా! నీవు తొందరపడకు! మల్లిక పెండ్లి విషయం నేను చూస్తాను!'' అన్నాడు హరికృష్ణ.

భ్రమరాంబ చిన్నబుచ్చుకున్నట్లుగా ముఖం పెట్టింది

హరికృష్ణ అన్నం ముగించుకొని, ముందు గదిలోకెళ్లి, తన మంచంమీద పడుకున్నాడు. ఆలోచనలు ముసురుకున్నాయి. మొట్టమొదటి సారిగా హరికృష్ణ తన తల్లి అభిరుచులకు వ్యతిరేకంగా నడుస్తున్నట్లు అనిపించి, బాధ కలిగింది. తన తల్లి అయినా, తను మేలును గురించి చెబుతున్నదిగానీ, ఆమెకు ఇందులో స్వార్థం ఏముంటుంది ? మల్లికకు గూడా పెండ్లి అయి, అదీ ఒక యింటిది అయితే తనకూ సంతోషమేగదా? తనకు భగవంతుడు అన్నీ ఇచ్చాడు. అందం వుంది, తెలివి వుంది, ఉద్యోగం వుంది. తను కోరుకున్న పిల్లను భార్యగా చేసుకునే అవకాశంమట్టుకు లేకుండాపోయింది. కనీసం, ఆ స్వరూపరాణి ముఖంలో అందచందాలు లేకున్నా, మామూలు స్త్రీల ముఖంవలెనన్నా ఉండగూడదా ? తన భార్య చాలా గొప్ప అందగత్తె కావాలన్న ఆశ్యాలు తనకు లేవు. కనీసం ఓ సంసార స్త్రీ లక్షణాలన్నా ఉండాలిగదా ? ఆ స్వరూపరాణి

"రాజుకు పాలు అంటే ఒకప్పుడు అయిష్టం... నేను న్యూట్రామూల్ కలిపి యిచ్చినప్పట్నించి మహా యిష్టం"





# "మరిప్పుడు వాడు న్యూట్రామూల్ మొనగాడు"

పిల్లలు పాలు తాగటానికి మారాం చేస్తున్నారా? లేదు, అంటున్నారు రుచికరమైన న్యూట్రామూల్ కి దీవనలిచ్చే అసంఖ్యాకమైన తల్లులు. రుచికి రుచీ, బలానికి బలం, న్యూట్రామూల్‌లో కోకో, పాలు మాల్ట్ లతో పుష్టి వుంది—




అలాగే రుచి. మరి దీన్లో ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజాలూ వున్నాయి. పెరుగుతూన్న దశలోని శరీరానికి పుష్టినిచ్చేవి యివి. సువాసనతో నిండిన న్యూట్రామూల్ ప్రతి కప్పూ ఎంతో పోషణని యిస్తుంది.



మార్కెట్ చేయువారు
గుజరాత్ కో-ఆపరేటివ్
మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

అమూల్
## న్యూట్రామూల్
ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు!

daCunha GCM-16 TL

పేరుకు తగ్గట్టు కాస్తన్నా స్వరూపం వుండ గూడదూ ?

వాటబవుట్ బ్యూటీ ? ప్చ్ ! ఏదో బజార్లో కనబడ్డ పిల్ల ! కనీసం పరిచయాలవరకుగూడా దారితీయవు, పరిచయం చేసుకోబోతే అపార్థాలకే వీలుంటుంది. కానీ బ్యూటీ ఒక స్టాండర్డ్ ! కనీసం బ్యూటీవలె వున్న పిల్లను తను నచ్చాలి !

రేపు ఐదుంబావుకు లెవల్ క్రాసింగ్ దగ్గర మరోసారి చూడాలి ! ముఖ్యంగా కాళ్లవంక చూడాలి ! ఆ కాలివేళ్లకు మెట్టెలు వున్నాయా ? లేవా ? !

## 7

హరికృష్ణ ఇంటికి వెళ్లివచ్చాక రెండు రోజుల వరకూ సంధ్య మళ్లీ హరికృష్ణ ఇంటికి పోలేదు. రోజూ హరికృష్ణ ఇంటికి వెళ్లి, అక్కడ నుండి ఐదింటికి బయలుదేరి ఐదుంబావుకల్లా లెవల్ క్రాసింగ్ దగ్గర ఎదురుపడి హరికృష్ణను చూడాలి, అని సంధ్య కాళ్లు తీపులుపెట్టేవి. అయినా సంధ్య ఎంతో నిగ్రహంతో తన్ను తాను సంభాళించుకుని, హరికృష్ణ ఇంటికి వెళ్లడం మానుకుంది. ప్రతిరోజు వారి ఇంటికి పనిగట్టుకొని తను వెళ్తే భ్రమరాంబ, మల్లిక ఏం అపార్థం చేసుకుంటారో అన్న భయంగూడా వకవంక పీకుతూవుండేది.

ఆ రోజు ఉదయం ఏడున్నరకల్లా సంధ్య గుంటూరు ప్రయాణానికి సిద్ధం అయింది. ఇంతలో స్వరూపరాణి, సంధ్య గదిలోకి వచ్చింది. స్వరూప కొద్దిగా కోపంగా వుంది.

''రా ! స్వరూపా !''

''రెండ్రోజులనుండీ కనబడలేదు !''

''స్వరూపా ! నీకు తెలుసుగదా ! ఉదయం ఎనిమిదింటికి ఇంటినుండి బయలుదేరితే మళ్లీ రాత్రి, ఏడింటికీ రావడం ! ఇక ఎలా వీలౌతుంది స్వరూపా ?''

''అవున్లే ! ఇంతకుముందుగూడా రోజూ గుంటూరు వెళ్లివస్తూగూడా, నన్ను కలుసుకునే దానివిగదా ?''

''... ... ... ...''

''నిన్న సాయంకాలం పదింటికి పెండ్లి చూపులు జరిగాయి !''

''ఓ ! యస్ ! స్వరూపా ! ఆఫీసు పని వత్తిడిలో ఆ సంగతే మర్చిపోయాను !''

స్వరూపరాణి కోపంగా, సంధ్యవంక చూసింది.

''చెప్పు స్వరూపా ! పెండ్లికొడుకు నచ్చాడా ?''

''నేను చెప్పను ఫో !'' అంటూ మూతి ముడుచుకుంది స్వరూపరాణి.

''ఏమ్మా ! కోపం వచ్చిందా ?'' అంటూ స్వరూప గడ్డం పట్టుకొని, సంధ్య బతిమలాడింది చెప్పమని. అయినా స్వరూప మాట్లాడలేదు.

''ఇంతకూ పెండ్లికొడుకు ఎలా వున్నాడు ? మీ బాబాయి చెప్పినట్లు, నీకంటె తంగులం రెండంగులాలు పొట్టిగా వున్నాడా ?''

స్వరూపరాణి తన కోపాన్ని మర్చిపోయింది. ''నేను చెప్పలా సంధ్యా ! కట్నం డబ్బులు ఎక్కువ

# సామెతల కథలు

ఎవరైన నోటితో చెబుతున్నా, బుకాయిస్తున్నా, కొట్టవచ్చినట్లు మాట్లాడుతున్నా ''ఏమిపెట్టుకు బతుకుతావంటే, నోరెట్టుకు బతుకుతా అన్నట్టుంది'' అని ఈ సామెతను చెబుతూంటాం. దీనివెనుకొక కథ ఉంది.

అనగనగా ఒక రాజు ఆ రాజుకు గులాబీ పువ్వులంటే చాలా యిష్టం. అందుకని ఒక గులాబీ తోటను పెంచాడు. అనేక ప్రాంతాల నుండి తెప్పించిన, అనేక రకాల గులాబీ మొక్కలు ఆ తోటలో వున్నాయి ఎప్పుడు చూచిన తోట రకరకాల గులాబీ పువ్వులతో కన్నులకు విందుగా వుంటుంది. ఆ గులాబీల వాసనతో ఆ ప్రాంతం అంతా నిండివుంటుంది ఆ గులాబీలను చూచి రాజుగారు ఎంతో గర్వంగా చెబుతూ, ఆనందించుతూండేవారు. అతడికి రాజ్య విషయాలకన్నా ఆ గులాబీ తోట అంటే యిష్టం ఎక్కువ. ఆ రాజు అగ్బరు అంటారు కొందరు.

ఆ తోటకు ఒక కాపలాదారుకూడా ఉన్నాడు. కొంతకాలం తరువాత, ఆ తోటలోని గులాబీ పువ్వులన్నీ తెల్లవారేటప్పటికి మాయమైపోతున్నాయి. ఎవడో రాత్రికి రాత్రి వచ్చి ఆ పూలను కోసుకెళ్ళుతున్నాడు. ఆ పని చేస్తున్నది మంత్రి కొడుకని కొందరూ, కాపలా వుంటున్న తోటమాలి కొడుకేనని కొందరూ చెబుతుంటారు.

రాజు, రాజ్యం పోయినా బాధపడేవాడు కాదేమో ! గులాబీలను ఎవరో దొంగిలించుకు పోతున్నారంటే, తన తల తీసివేసినట్టుగా బాధపడ్డాడు. కాపలావాళ్ళను పెట్టి బాగా బంధోభస్తు చేసాడు. కాని ఫలితం శూన్యం. రాజుకు నిద్రాహారాలు లేవు. ఏమైనాసరే దొంగను పట్టి ఉరి వెయ్యాలనుకుని, సైనికులను రప్పించి ఆ తోటకు కాపలా వుంచాడు.

ఒకనాడు తెల్లవారుజామున గులాబీలు కోసుకునిపోతున్నవాడిని సైనికులు పట్టుకున్నారు. అతడు కోసుకుపోతున్న గులాబీలతోసహా, అతడిని శకటంలో ఎక్కించుకుని సైనికులు అతడిని రాచబాటగుండా రాజసౌధంకు తీసుకుపోతున్నారు. మధ్యలో మంత్రి సౌధవం వుంది. గోడవకు మంత్రిగారు బైటకు వచ్చారు. అంతా తెలుసుకున్నాడు.

తన కొడుకే దొంగపని చేసినందుకు మంత్రి చాలా విచారించాడు. దీనివల్ల కుటుంబానికి ఆపదా, చెడుపేరూ వస్తుందని, కొడుకుని ఉద్దేశించి, అతడికి వినిపించేటట్టు ''నోరెట్టుకుని బ్రతకవచ్చు'' అన్నాడు. కొందరు ''నోరుంటే బ్రతకవచ్చు'' అన్నాడంటారు. అలా అర్థోక్తిగా మంత్రి కొడుక్కి సలహా యిచ్చాడు.

దొంగతనం చేసింది తోటమాలి కొడుకనీ, అలా సలహా యిచ్చింది తోటమాలి అనీ చెబుతుంటారు.

ఆ సలహా విన్న దొంగ, రాజుగారి సముఖమునకు వెళ్ళేటప్పటికి, బుట్టలో ఉన్న పూలన్నింటినీ తినివేసాడు. సైనికులు వెళ్ళి దొంగను పూలతో పట్టుకొచ్చినట్టు చెప్పారు. కోపంతో రాజు వచ్చాడు. దొంగ, ''నేను దొంగను కాదనీ, నేను పూలను కోసుకెళ్ళుతుండగా పట్టుకున్నట్టు సైనికులు చెబుతున్నారుగదా, అయితే, ఆ పూలు ఏమైనాయి... నా దొంగతనాన్ని నిరూపించి, నాకు శిక్ష వేయండి'' అని వినయంగా రాజును అభ్యర్థించాడు.

శకటంలోని పూలబుట్టల కోసం వెళ్ళిన సైనికులు తెల్లముఖాలతో వచ్చారు. రాజుకు సైనికులపై కోపం వచ్చి వాళ్ళకు శిక్ష వేసాడు. దొంగను విడిచిపెట్టాడు. అలా నోరెట్టుకుని బ్రతికాడు గులాబీల దొంగ.

ఇవ్వాల్సొస్తుందని, బాబాయి నాతో అబద్ధం చెప్పాడు. ఆయనగారు పొట్టిగాడుగాని, నాతో సరిసమానమైన ఎత్తు కలవాడు.''

''ఎక్సలెంట్ ! ఇంకేం ? కుర్రాడు నీకు నచ్చాడు ! యస్, అనేశాయ్ !'' అన్నది సంధ్య సంతోషంగా, ఇక హరికృష్ణకు స్వరూప బెడద తప్పుతుందని.

''ప్చ్ ! ఈ సంబంధంగూడా తేల్చుకోలేక పోతున్నానే ! ఆ ఇంజనీయర్ సన్నగా, నా ఎత్తున వున్నాడు. రంగు కొద్దిగా నలుపుకిందనే లెక్క ! మనిషిని చూస్తుంటే, మగాడ్ని చూసినట్లు అనిపించడంలేదు !''

''ఊం !'' అంటూ దీర్ఘంగా నిట్టూర్చింది సంధ్య.

''అయితేనేం ? హైదరాబాద్‌లో బంజారా హిల్స్‌లో, స్వంత ఇల్లు వుంది. రాజ్‌దూత్ మోటార్‌సైకిల్ వుంది. ఆధునిక గృహంలో వుండవలసిన అన్ని పరికరాలూ వున్నాయి ! నిజంగా నేను కలలుగనే ఇల్లు !''

స్వయం

''పోనీయ్ స్వరూపా ! పిల్లవాడు ఎలా ఉంటేనేం ? నీవు ప్రాక్టికల్ గర్ల్‌వి ! బ్యాక్‌గ్రౌండు బాగుంది. ఒప్పేసుకో !''

''ఎలా ఒప్పుకోవాలే ? పెండ్లవగానే హనీమూన్‌కు, ఏ కాశ్మీరో, సిమ్లాయో వెళ్లాలిగదా ! అతడు నా ప్రక్కన నడిస్తే, బొత్తిగా బాగున్నట్లు అనిపించడంలేదే ?''

సంధ్యకు, స్వరూప ధోరణి విసుగును కలిగిస్తున్నది.

''స్వరూపా ! ఓ పని చెయ్ !''

''ఏంటి ?''

''ఆ హైద్రాబాద్ ఇంజనీర్ను చేసుకో, గుంటూరు ఆయనతో హనీమూన్ వెళ్ళు ! ఎంత దర్జాగా వుంటుందో తెలుసా ?'' అన్నది సంధ్య సీరియస్ ఫోజుపెట్టి.

స్వరూప చటుక్కున కోపంగా సంధ్య వీపు

## నోరెట్టుకు బ్రతుకుతా

ఈ సామెతపై మరొక పిట్టకథ కూడ చెబుతారు. ఒకనాడొక తల్లికాకి తన బిడ్డ పిల్లకాకితో "తెలివితక్కువదానవు... ఎలా బ్రతుకుతావో..." అంది చాలా విచారంగా

"నీవేమీ విచారించకమ్మా... నేను హాయిగానే బ్రతుకుతా..." అని సంతోషంగా ధైర్యంగా సమాధానం చెప్పింది.

"హాయిగానే... ఎలా!.." అని, తన బిడ్డ ధైర్యానికి ఆశ్చర్యపోతూ అడిగింది తల్లికాకి.

"నోరెట్టుకు బ్రతుకుతా" అంది పిల్లకాకి.

"నీకంత తెలివితేటలా..." అడిగింది తల్లికాకి.

"ఇదుగో చూడు..." అంటూ, ఆ చెట్టు క్రింద ఒకడు భోజనం చేస్తున్నాడు, అతడిపైనా, అన్నంలోనూ పడేటట్టు రెట్టవేస్తూ; కా...కా... అని అరిచింది పిల్లకాకి. అతడు రెట్టను చూసాడు, కాకి అరుపుకు పైకి చూసాడు. అది కాకిరెట్టని తెలుసుకుని, కడుక్కోటానికి లేచివెళ్ళాడు. పిల్లకాకి వెంటనే ఎగిరివచ్చి అన్నం బొక్కుతూ "యిలా..." అని తల్లికి చెప్పింది పిల్లకాకి.

ఈ సామెత వెనుక కథ ఏదైనా, యీనాటికీ, మాటలమ్ముకుని, నోటితో బ్రతికేవాళ్ళు కష్టించి బ్రతికేవాళ్ళకంటే ఎక్కువనిపిస్తుంది. అందువల్లనేనేమో, యీ సామెతను యీనాటికీ మనం తరచుగా అంటుంటాం. ★

— *పద్మావతి గంగాధర్*




**వరం**

మీద చరిచి తనను సంధ్య తిరిగి కొడుతుందేమోనన్నట్లుగా దూరంగా జరిగింది. సంధ్య మౌనంగా వీపును తుడుచుకుందిగాని మాట్లాడలేదు. సంధ్య ప్రవర్తన స్వరూపకు ఆశ్చర్యం కలిగించింది. మరుక్షణంలో కళ్ళలో నీరు తిరుగగా సంధ్యతో అన్నది,

"సంధ్యా! నాకు ఈ విషయంలో సాయంగా వుంటావని అనుకున్నాను. నీవూ నా డైలమాని అర్థంచేసుకోకుండానే గేలి చేస్తున్నావు."

"మరేం చేయను? నీ డైలమాలు వింటూంటే మతి పోతున్నది. ఏదో ఒకటి నీవే తేల్చుకోవాలి. పోనీ ఒకరి సలహానుఅన్నా వినాలి. నీకు తోచదు, ఇతరులు చెబితే వినవు. ఇంకనెవరు ఏం చెయ్యగలరు?"

"సంధ్యా! ఒక్కమాట చెప్పు, నన్నేం చేయమంటావో?"

"నామాట వింటావా?"

"ఆఁ!"

"హైదరాబాద్ ఇంజనీర్ను చేసుకో."

"మనిషి బాగుండడు."

"మరి గుంటూరు సంబంధం ఒప్పేసుకో."

ఒక్కక్షణం సంధ్య గుండెలు దడదడలాడాయి.

"ఆ గుంటూరు సంబంధంలో ఏముందే? పర్సనాలిటీ తప్ప?"

"లాస్ట్ ఎండ్ ఫైనల్! ఆఖరి సలహా ఇంక ఒక్కటే వుంది?"

"సంధ్యా! ఏంటో చెప్పవే?" అన్నది స్వరూప ఆతృతగా.

"గుంటూరు సంబంధం యువకుని పర్సనాలిటీ, హైదరాబాద్ సంబంధం వంటి బ్యాక్‌గ్రౌండూ కలిగిన సంబంధం మరోటి చూడమని మీవాళ్ళకు చెప్పు."

"ప్చ్! ఎక్కడ దొరుకుతాయే? అలాంటి సంబంధాలు!"

"పేపర్లో ఎడ్వర్టైజ్ చేయించమను."

స్వరూపరాణి ముఖంలో ట్యూబ్ లైట్ వెలిగింది.

"థ్యాంక్స్ సంధ్యా! మంచి అయిడియా ఇచ్చావు. నాకు తెలుసు! నీ బుర్ర అమోఘం!"

"స్వరూపా! నాకు బండికి టైం అవుతున్నది."

"ఓకె! ఓకె! తర్వాత మళ్ళీ కలుస్తాను" అంటూ స్వరూప నవ్వు ముఖంతో వెళ్ళిపోయింది.

స్వరూప వెళ్ళిపోయాక సంధ్య దీర్ఘంగా నిట్టూర్చింది. స్వరూపను తల్చుకుంటే సంధ్యకు జాలివేసింది. ఇక హరికృష్ణను తను నిర్విచారంగా ప్రేమించవచ్చు. స్వరూప ఖచ్చితంగా హరికృష్ణ సంబంధం నచ్చలేదన్నట్లే లెక్క. స్వరూపకు హరికృష్ణ అయిన ఒకటే, ఇంకెవ్వరైనా ఒకటే. కానీ, తనకు అలాకాదు. తను హరికృష్ణను ప్రేమించింది...

సంధ్య భోజనంచేసి స్టేషన్‌కు బయలుదేరింది.

ఈ రెండు మూడురోజులబట్టీ సంధ్య, గిరిజలు ఇంకా చేరువ అయ్యారు. గిరిజకు ఆమె తలిదండ్రులు చూసిన రెండో పెళ్ళి సంబంధం వరుడు వేరే పిల్లను చూసుకున్నాడని గిరిజ చెప్పింది. గిరిజ ఈ రెండురోజులుగా మౌనంగా, నిరుత్సాహంగా ఉంది.

గిరిజ సంధ్యను స్టేషన్ దగ్గర కలుసుకుంది ఇద్దరూ స్టేషన్‌లోకి నడుచుకుంటూ వెళ్తున్నారు.

"గిరిజా! ఏంటి డల్‌గా వున్నావు? ఇంకా ఆ సంగతి మర్చిపోలేదా?"

"ఎలా మర్చిపోనే?"

"ఆ రెండోపెళ్ళి వాడు గాకుంటే ఇంకోడు"

"ఇప్పుడా రెండో పెండ్లివాడ్ని తలుచుకుని, అందలేదే అని దుఃఖిస్తున్నాననుకుంటున్నావా? లేదే! ఆఖరుకు రెండో పెండ్లి సంబంధాన్నిగూడా తమ స్వార్థచింతనతో చెడగొట్టదల్చుకున్న మావాళ్ళను తల్చుకుంటుంటే దుఃఖం ఆగడం లేదే!"

"గిరిజా! మరీ అజ్ఞానంలో పడకు! నీ తలిదండ్రులు స్వార్థపరులు గావడం నీ దురదృష్టం! అయినా ఆలోచించు. నీకు పాతిక సంవత్సరాలపైనే వయస్సు వుంది. తలిదండ్రులకు, తమ బిడ్డలమీద శాశ్వతంగా ప్రేమ వుండదు. వాళ్ళను నిందించడం అనవసరం. ఏదో కడుపున పుట్టినందుకు పెంచారు! పెద్ద చేశారు. ప్రయోజకురాల్ని చేశారు! విద్యాబుద్ధులు చెప్పించారు! కొంతకాలం మంచి బుద్ధితోనే నీకు పెండ్లి చేయాలని ప్రయత్నాలు చేశారు. వాళ్ళ డ్యూటీ అయిపోయింది. ఇక ముసలితనంలో నిన్ను ఉపయోగించుకోవాలనుకుంటున్నారు. కనుక, నీ పరిస్థితులను బేరీజు వేసుకొని నీ జీవితాన్ని నీవు నడుపుకోవాలి! నీకు నచ్చిన, నిన్ను నచ్చిన యువకుడ్ని నీవే ఎన్నుకోవాలి!"

"వ్వాట్?! గిరిజా! నేననుకుంటే నాకంటే విప్లవాత్మకంగా తయారౌతున్నావే?"

"విప్లవం లేదు! నీ తలకాయలేదు! ఉన్న పరిస్థితులలో నీ సమస్యకు ఒక పరిష్కారం!"

"ఏడ్చినట్లే వుంది! ఇప్పుడు నేను

బయలుదేరి, నా పెండ్లి సంబంధాలు నేను చూసుకోనా ?! పోనీ నీలాగా అందచందాలు నాకుంటే అది వేరే సంగతి. అయినా నీకుమట్టుకు నాలాటి పరిస్థితులేగదా! నీ సమస్యా పరిష్కారానికి నీవేం చేస్తున్నావు తల్లీ ?''

''అలా అడుగకూడదు! శాస్త్రులవారు పురాణంలో ఉల్లిపాయ తినగూడదనే చెబుతాడు. డాక్టర్లు కాఫీ, సిగరెట్లు తాగకూడదనే అంటారు శాస్త్రులవార్ని పట్టుకొని, ఏమయ్యా! మీ ఇంట్లో ఉల్లిపాయలు తినరా ? అని అడుగడం, డాక్టరుని పట్టుకొని నీవు కాఫీ, సిగరెట్ తాగవా అని, అడుగడం తెలివితక్కువ!'' అన్నది సంధ్య.

గిరిజ మౌనంగా సంధ్య చెప్పిన మాటలను జీర్ణించుకుంటున్నది.

గిరిజ, సంధ్యలు లేడీస్ కంపార్ట్మెంటు దగ్గరకు చేరగనే యువతులు వాళ్లను చుట్టు ముట్టారు. ప్రశ్నల వర్షం కురిపించారు. స్వరూపరాణి చూసిన లేటెస్ట్ పెండ్లిచూపులను గురించి అడిగారు. కానీ, తను ఈ తడవ పెండ్లి చూపులకు వెళ్లలేదని తెలిసి, ఆ యువతులు నిరుత్సాహపడిపోయారు.

సంధ్యతోబాటు విజయవాడనుండి గుంటూరు వెళ్లేవాళ్ళు—ఒక్క సరోజినితప్ప, అంతా పేద కుటుంబంలోని యువతులు. గుంటూరులో చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకుంటూ కాలక్షేపం చేస్తూ వుంటారు. వాళ్ళు అంతకంటే చిన్న ఉద్యోగం విజయవాడలోనే చిక్కడం మహాద్భాగ్యంగా భావిస్తారు. ప్రభుత్వోద్యోగం వస్తే, లాటరీలో ఫస్ట్ ప్రైజు వచ్చినట్లు ఆనందపడిపోతారు. వాళ్లలో చాలామంది తమ జీవితంలో తమకు వివాహం కాదు, అని రూఢిపర్చుకున్నారు. తమ తల్లిదండ్రులు కట్నం ఇచ్చి పెండ్లి చేయడం, అసంభవం అని వారికి తెలుసు! కట్నం తీసుకో కుండా పెండ్లి చేసుకొనే యువకుడు ఇండియాలో లేడని వారి దృఢనమ్మకం. ఇక ప్రేమ వివాహాలు ఒక్కటే మార్గం అనుకుంటారు. కానీ ఇవీ కత్తులబోనులని వారికి తెలుసు. తెలిసినా అప్పుడప్పుడు వక్కో అమ్మాయి, ఆ కత్తుల బోనుల్లో పడిపోతూ వుంటుంది. ఆ అమ్మాయిని గురించి కొన్నాళ్లు చర్చించుకుని మర్చిపోతుంటారు.

అమ్మాయిలంతా స్వరూపరాణి పెండ్లి చూపులను గురించి మాట్లాడుతుంటే సంధ్య, గిరిజలు మౌనంగా వున్నారు. మేడం సరోజిని తనకేమీ పట్టనట్లు ఏదో మేగజైన్ చదువు కుంటున్నది. సరోజినిని చూసి, సంధ్య ఆలోచన లో పడిపోయింది. హరికృష్ణకు మేడం చెల్లెల్ని ఇచ్చే విషయం ఎంతవరకూ వచ్చిందోనని సంధ్య ఆందోళనపడిపోయింది. ఏమైనా ఈరోజు హరికృష్ణ ఇంటికి వెళ్లి, సంగతులు తెలుసుకోవాలి అని అనుకుంది.

స్టేషన్ దాటి గిరిజ, సంధ్యలు గుంటూరు బజార్లో నడుస్తున్నారు.

''సంధ్యా! నీవు చెప్పింది రీజనబుల్ గానే వుంది! కానీ, నాలాటిది ప్రేమించి పెండ్లి చేసుకోవడం సంభవం అంటావా ?'' అడిగింది గిరిజ.

# స్వయంవరం

''మీవాళ్ళు నీకు పెళ్ళి సంబంధాలు తెచ్చి పెండ్లిచూపులు జరిపించి, కట్నం ఇచ్చి పెండ్లి చేయగలగడం సంభవమంటావా ?''

''అసంభవం అని తెలుస్తూనేవుంది.''

''అయితే ఇంకెన్నాళ్ళు బాధ్యతారహితులైన పెద్దవాళ్ళమీద నీ పెండ్లి భారం మోపి వాళ్ళు తమ బాధ్యతలను తీర్చుకోవడంలేదని ఏడుస్తూ కూర్చుంటావు ?''

''.........''

''కాబట్టి విను! నీకు నచ్చినవాడ్ని నీవు చూసుకో''

''సంధ్యా! స్టాప్ నాన్సెన్స్! నేను ఈమాత్రం సుఖంగానైనా బ్రతకడం నీకు ఇష్టంలేదా ?''

''సుఖం ? ఏంటే నీ వనుభవించే సుఖం! నీ ఈడు పిల్ల రెండో పెళ్ళి సంబంధం చేసుకోవాలంటే సగం చచ్చికాని వప్పుకోదు. అది తప్పిపోయినందుకు సంతోషిస్తుంది గాని, ఏడవదు. నీవు రెండో పెళ్ళి సంబంధం తప్పిపోయిందని ఆత్మహత్యకుగూడా వెనుదీయలేదంటే ఎంత ?... ఎంత ... ఘోర దురన్యాయం ?!''

''నీకో సారి చెప్పాను. ఆ రెండో పెళ్ళి సంబంధం తప్పిపోయిందనికాదు నా బాధ! నా తల్లిదండ్రులే ఆఖరుకు ఆ రెండో పెళ్ళి సంబంధాన్ని గూడా ఇష్టపూర్తిగా తప్పించాలని కుట్రవన్నుతుంటే ... నాకు ... నాకు ... నాకు...'' అనలేక అనలేక అన్నది గిరిజ. ఇంక ఎక్కువగా మాట్లాడితే బజార్లోనే కన్నీళ్ళు రాల్తాయని భయపడి మౌనం వహించింది.

''అదే! అదే! మానుకోమన్నాను. ఇక నీవాళ్ళు నీకు పెళ్ళి సంబంధాలు చూడరని తెలిందిగదా ? లేక ఏవో చూస్తున్నట్లు నటించి ఆఖరు క్షణాన ఏదో కారణంవల్ల తప్పిపోయిందని అనలేరుగదా ? గిరిజా! నీవు నిజంగా చాలా అదృష్టవంతురాలివి! నీవాళ్ళ నిజరూపాలు దైవవశాత్తూ నీకు తెలిసిపోయాయి. లేకుంటే జీవితాంతం వాళ్ళమీదనే భారంవేసి వాళ్ళు నిన్నలా మోసంచేస్తూవుంటే అజ్ఞానంగా వుండిపోయేదానవు గదా ?''

''.........''

''పోనీ గిరిజా! ఈ పరిస్థితులలో నీవు నీ జీవిత భాగస్వామిని ఎన్నుకోవడం ఏం తప్పు గాదు. ఏ మానవుడూ, ఏ దేవుడూ నిన్ను తప్పుపట్టడానికిలేదు.''

''సంధ్యా! నీవింకా మేఘాలలో నే విహరిస్తున్నావు. కండలుతిరిగిన వస్తాదులు కాళ్ళు విరిగి పడివుండే మూలనున్న ముసలాణ్ణి యుద్ధానికి పొమ్మన్నారంట! ఇంత అందం వుంది! నీవు స్వంతంగా ఎవర్నైనా ప్రేమించి వివాహం చేసుకోగలిగావా ? ఇక నాకు కబుర్లు చెబుతున్నావు!''

''ఆగు గిరిజా! ఆగు కొద్దికాలంలోనే నాకు కాబోయే భర్త నాదగ్గరకు రానున్నాడు.''

గిరిజ నడిచేదలా చటుక్కున ఆగి,

''నిజమా ? ప్రేమిస్తున్నావా ? ఎవర్ని ?'' అని ప్రశ్నలవర్షం కురిపించింది.

''టట్! వదు! నిలబడకు'' అంటూ సంధ్య నడిచిపోతూవుంటే గిరిజ సంధ్యను కలుసుకుని,

''చెప్పవే ? ఎవరు ?'' అని అడిగింది.

''ఇంకా ఎవరూ లేరు.''

''ఓస్! ఇంతేనా ? ఇంకా ఏదైనా పెద్ద ప్రేమాయణంలో పడ్డావేమోనని సంతోషపడ్డాను. సంధ్యా! ఈ ప్రేమ అంటే నాకు వచ్చే భయమే! అసలు నన్నెవ్వరూ ప్రేమించరు. ఆ ప్రేమ వ్యవహారాలలోపడి ఇంకా బాధలు పడదల్చుకోలేను.''

''అరే! గిరిజా! ఏంటలా నీరుగారిపోతావు? ఇప్పుడు నిన్ను తక్షణం ఎవ్వర్నైనా ప్రేమించమని అనడంలేదే! ఎవరైనా నీయందు ఇంటరెస్టు చూపిస్తే వాళ్లను పరిశీలించు. వివాహ యోగ్యుడు అని అనిపిస్తే ఎంకరేజ్ చేయి. ఈ సృష్టి అతి విచిత్రమైనది. ఎవరు ఎవర్ని ఎందుకు ప్రేమిస్తారు ? అన్నది ఎవ్వరికీ అంతుచిక్కని విషయం! ఏమో ? నీవంటేగూడా ఇంటరెస్టు చూపించే యువకులు అస్సలు లేరంటావా ?''

గిరిజ కొద్దిసేపు ఆలోచనలో పడ్డది తను అంటే ఎవరెవరు ఇంటరెస్టు చూపించారా, అని జ్ఞాపకం చేసుకుంటున్నది. సంధ్య, గిరిజ ముఖం వంకే చూస్తున్నది—ఏమాత్రం డిస్టర్బ్ చేయకుండా. కొద్దిసేపయ్యాక గిరిజ అన్నది మెల్లగా—

''నేనంటే...ఒకడు ... ఒకసారి...ఇంట్రెస్టు చూపించాడు!''

''కరెక్ట్! చూశావా ? నీవు పొత్తిగా అందగత్తెవు కావని అనుకుంటున్నావు! అయినా ఒక పురుషుడు నీయందు ఇంటరెస్టు చూపించాడా, లేదా ?''

''ఏడ్చాడు! వాడొట్టి దొంగవెధవ అని తేలింది!''

''అదేంటోయ్ ?!''

''అదంతే! రెండేళ్లక్రింద మా ఆఫీసులో ఒక యు. డి. సి. నేనంటే ప్రత్యేక అభిమానం చూపుతున్నట్లు, అనుమానం కలిగింది. కొన్నాళ్ళు అలా చూపులతోనే ఆగిపోయాడు. ఆ తరువాత హఠాత్తుగా నేనంటే చాలా ఇంటరెస్టు చూపించాడు! ఆఫీసుకు లేటుగా వస్తే, 'ఏంటండీ! ఆలస్యం అయింది ?' అని అడిగేవాడు. వర్కు ఎక్కువగా వుంటే, చేసిపెట్టేవాడు. సంధ్యా! నిజంగా చాలా ఆశపడ్డాను. ఇతడ్ని జాగ్రత్తగా కల్టివేట్ చేయాలనుకున్నాను బహుశః అతడ్నే... వివాహంగూడా... చేసుకోగలనేమో అనిపించింది... కానీ... తరువాత విచారిస్తే... వాడు ... పెళ్ళాన్ని పుట్టింటికి పంపి, వారం రోజులైందట!...''

సంధ్యకు ఆ మాటలు విన్నతరువాత రోషం కోపం ముంచుకువచ్చాయి.

''దొంగరాస్కెల్!'' అన్నది సంధ్య కోపంగా.

గిరిజ విషాదంగా నవ్వుతూ, మళ్లీ చెప్పడం మొదలెట్టింది.

[ఇంకా వుంది]

# డాక్టర్ సలహాలు

కె. ఎస్. కె. — కొరిటపాడు

నాకు కుడిప్రక్క రొమ్ము ఆడవారికివలె కొంచెము ఎత్తుగా వుంటుంది. ఇది ఎలా తగ్గుతుంది? ఎడమప్రక్క మామూలుగానే వుంటుంది.

★ దీనిని గైనకో మాస్టియా అంటారు. మగవారిలోకూడా ఆడవారికివలెనే మామరీ గ్రంధులు ఉంటాయి. కాని హార్మోనుల ప్రేరేపణ లేకపోవటంవల్ల మగవారిలో ఇవి పెరగటం జరుగదు.

మగవారిలో కూడ ఆడవారికివలెనే ఈస్ట్రోజెన్లు ఉత్పత్తి అవుతాయి. కాని వాటిని లివర్ అణచివేస్తుంది. లివర్ సరిగా పనిచేయక పోయినప్పుడు ఈ హార్మోనులు నెత్తురులో ఎక్కువ అయి మామరీ గ్రంధులు పెరగటం జరుగుతుంది.

మరీ అసహ్యంగా ఉంటే శస్త్ర చికిత్స ద్వారా తీసివేయటం మంచిది.

జి. పి. కె. — మలికిపురం

మా అమ్మగారి వయస్సు 30 సం॥లు. ప్రతి రోజా విపరీతమైన జలుబు వుంటుంది. ఎన్ని మందులు వాడినా ఏమీ ప్రయోజనము కన్పించ లేదు. ఏ వాసనా పడదు. దీనికి ఏమిచెయ్యాలి? ఆపరేషన్ అవసరమా?

★ క్రానిక్ పెరాక్సిస్ మల్ రైనోరియా అనే రోగం ఉన్నవారికి ఇలా తరచూ జలుబు రావటం జరుగుతుంది. ఇ. ఎన్. టి. వైద్యులకి చూపించుకొని "సెప్టల్ డీవియేషన్" గాని 'పాలిప్' గానీ అలర్జీవల్ల ఏర్పడే ముక్కులోని మ్యూకస్ పొర వాపుగాని ఉన్నదీ లేనిదీ తీర్మానించుకోవాలి.

ఆపరేషన్ అవసరమయ్యేదీ లేనిదీ పరీక్ష ఫలితాలనుబట్టి నిర్ణయించవలసి ఉంటుంది.

జె. ఎస్. ఆర్. — ప్రొద్దుటూరు

మా అమ్మగారికి తలలో గుల్లలు లేచుచున్నవి. అవి లేచినపుడు తలంతా దురదగా వుండి తల భారంగా వుంటుంది. ఎక్కువ దురద అయినపుడు ఆ గుల్లలు దద్దుర్లవలె ఎర్రగా అవుతున్నాయి. చాలా బాధగా వుంటుంది. అన్ని రకముల ఆయింట్‌మెంట్లు వాడినాము. ఏమీ ప్రయోజనము లేదు.

★ తలలోని కురుపులకి చాలా కారణా లున్నాయి. మామూలుగా రాగల కురుపులు యాంటీబయాటిక్ మాత్రలవల్లగాని ఇంజక్షన్ల వల్లగాని నయమవుతాయి.

ఫంగస్‌వల్ల రాగల కురుపులకి గ్రైసోవిన్ మాత్రలు రోజుకి ఆరు వంతున (పూటకి రెండు) వరుసగా 20 రోజులపాటు వాడాలి. విటమిన్ 'సి' మాత్రలు వీటితోకూడా వాడటంవల్ల కురుపులు త్వరగా మానిపోతాయి.

జె. ఆర్. — సికింద్రాబాద్

నా వయస్సు 16 సం॥లు. నాకు గజ్జలో ఎర్రని దద్దురు లేచినది. దానిచుట్టూగూడా ఎర్రని రంగు తేలింది. ఆ ప్రదేశములో చాలా దురదగా వుంటుంది. దీనికి కారణము ఏమిటి? నివారణోపాయము తెలుపప్రార్థన.

★ "స్టెఫలో కాక్కస్" అనే సూక్ష్మక్రిముల వల్ల ఇలా రావచ్చును. ఈ లక్షణం ఉన్నవారు పెన్సిలిన్ ఇంజక్షన్ వైద్యుల పర్యవేక్షణలో టెస్ట్ డోస్ వేయించుకొన్న అనంతరం, వరుసగా అయిదు రోజులపాటు వేయించుకోవలసివుంటుంది.

పెన్సిలిన్‌కి అలర్జీ ఉన్నవారు టెర్రామైసిన్ వంటి మందులు వాడటం అవసరం.

అండర్‌వేర్లతో కప్పబడే చర్మపు ప్రాంతాలని ప్రతిరోజా శుభ్రపరచటం చాలా అవసరం.

బి. ఆర్. ఆర్. — బేవంచెర్ల

'అల్సరేటివ్ క్యులైటిస్' అనే వ్యాధి ఎందుకు వస్తుంది? ఇది ఒకసారివచ్చి నయమయిన తర్వాత తిరిగి వచ్చే అవకాశము వున్నదా?

★ పెద్దప్రేవులు వాయటం, వాటిలో పుండ్లు ఏర్పడటాన్ని అల్సరేటివ్ కొలైటిస్ అని అంటారు. అమీబియాసిస్, బాసిల్లరీ డిసెంటరీ, ట్యూబర్క్యులోసిస్ మొదలయిన రోగాలవల్ల ఈ ప్రేవులలో పుండ్లు ఏర్పడినా సాధారణంగా కారణం ఇదమిత్థంగా తేలని పుండ్లని అల్సరేటివ్ కొలైటిస్ అని వ్యవహరిస్తారు. కొందరికి మానసిక ఆందోళన, విరక్తి మొదలయినవాటివల్ల ఈ రోగం రావచ్చునని ప్రముఖ వైద్యుల అభిప్రాయం. చికిత్సానంతరం తిరిగి ఈ రోగం వచ్చేదీ రానిదీ పుండ్లు ఏర్పడిన భాగాన్ననుసరించి వుంటుంది. వయస్సు మీరిన వారిలోను, బాగా విస్తరించిన పుండ్లు వున్న వారిలోను ఈ రోగం నయమయిన తర్వాత మరలా రాగల అవకాశాలెక్కువ. గుదస్థానం (రెక్టం)లో పుండ్లు ఏర్పడినవారికి పూర్తిగా మానిపోయే అవకాశాలెక్కువ.

కె. ఆర్. కె. ఎస్. — విజయవాడ

నా వయస్సు 21 సం॥లు. నాకు 10 సం॥ల క్రితం కీళ్ళనొప్పులు వచ్చి తగ్గినవి. అప్పటినుండి గుండెజబ్బు వచ్చినది. ఇప్పటికీ నాకు పైకి ఏవిధమైన జబ్బు కనబడటంలేదు. కాని హార్టు కంప్లెయింట్ వున్నట్లు డాక్టర్లు చెబుతున్నారు. ఆపరేషన్ లేకుండా నాకొచ్చిన గుండెజబ్బు తగ్గుతుందా?

★ మీకు వచ్చిన కీళ్ళనెప్పులు "రుమాటిక్ ఫీవర్" వల్ల వచ్చివుంటుంది. విపరీతంగా జ్వరం వచ్చి పెద్ద పెద్ద కీళ్ళు వాయటం జరుగటాన్ని రుమాటిక్ ఫీవర్ అని అంటారు. ఒక్కొరోజు ఒక్కొ కీలు వాయటం ఈ రోగ ప్రత్యేకత. ఈ రోగాన్ని నిర్లక్ష్యం చేసినవారికి, హృదయంలోని కవాటాలు వాయటం జరుగుతుంది. బాధింపబడిన కవాటాలనుబట్టి రోగలక్షణాలు ఉంటాయి. రోగ లక్షణాలనిబట్టి ఆపరేషన్ చేయటమా వద్దా అనేదాన్ని వైద్యులు నిర్ణయిస్తారు. మందులవల్ల కవాటాలలో ఏర్పడిన నిరంతర మార్పులను సరిచేయటం సాధ్యంకాదు.

—డా॥ కె. వెంకటేశ్వరరావు



## ** సినిమా విశేషాలు **

—జి.వి.జి.

### కొత్తపేట రౌడీలో రామదండు

డైరెక్టర్ పి. సాంబశివరావు "స్టార్ట్!" అన్నారు.

'రామదండు సేవాసమితి' కార్యాలయం మీద ఎగురవేయబడిన రామదండు జెండా నుంచి కెమెరాను కిందికి టిల్ట్ చేశారు వి. ఎస్. ఆర్. స్వామి.

ఒక ఎర్ర రిబ్బను ద్వారానికి అడ్డంగా కట్టి వుంది. పండిన జుట్టు, తెల్లని గడ్డంతో సర్వోత్తమరావు (పి. ఎల్. నారాయణ), కృష్ణ (హీరో కృష్ణ), కైలాసం (నూతన్‌ప్రసాద్), రాధ (జయప్రద), స్పెషలాఫీసర్ కుమార్ (చిరంజీవి), పాండు (లక్ష్మీకాంత్), మరికొందరు బాలబాలికలున్నారు. కైలాసం, కృష్ణ చేతుల్లో పూలదండలున్నాయి. రాధ చేతిలోని చిన్న ట్రేలో పట్టుగుడ్డ మీద ఒక వెండి కత్తెర వుంది.

కైలాసం ముందుకొచ్చి, "అయ్యా, సర్వోత్తమరావుగారూ! ప్రజలకోసం మీ సర్వస్వం ధారపోసి సేవ చేసిన త్యాగధనులు తమరు. ప్రజల మేలుకోసం ప్రజలే స్థాపించుకున్న ఈ సంస్థను తమరే ప్రారంభించాలి," అంటూ కృష్ణ వంక చూశాడు.

సర్వోత్తమరావు మెడలో కృష్ణ దండ వేశాడు. ఆయన ముందు రాధ ట్రే వుంచగా ఆయన ఠీవిగా కత్తెర తీసుకుని, రిబ్బన్ కత్తిరించి, లోపలికి వెళ్లబోయాడు.

"ఒక్క క్షణం ఆగండి!" అని సర్వోత్తమరావుని ఆపి, కైలాసం యిలా అన్నాడు: "మీ కుమారుడు శ్రీ ప్రసన్నకుమార్ ఈ నగరానికి నేర పరిశోధక శాఖ స్పెషలాఫీసరుగా రావడం మా అదృష్టంగా భావిస్తున్నాం. రేపట్నుంచీ మా పనులన్నీ వారితోనే. నీతి నిజాయితీలకు ఎంతో పేరు తెచ్చుకున్న శ్రీ కుమార్‌గారిని ఈ భవనంలో మీతోపాటు ముందడుగు వేయమని కోరుతున్నాను," అంటూ కుమార్‌కు మాల వేశాడు. అందరూ చప్పట్లు కొట్టారు.

"కుమార్జీ, రాత్రికి మా తోటలో విందు," అన్నాడు కైలాసం.

"వొట్టి విందేనా?" క్రీగంట చూశాడు కుమార్.

"గట్టి విందేనండి," అని రహస్యంగా చెప్పాడు కైలాసం.

వెంటనే "రామదండుకీ జై" అన్న జయధ్వానాల మధ్య అంతా గృహప్రవేశం చేశారు.

సత్యనారాయణ, సూర్యనారాయణ నిర్మించే సత్య చిత్ర వారి "కొత్తపేట రౌడీ" వన్నెల చిత్రానికి ముళ్ళపూడి వెంకటరమణ రచయిత, మహదేవన్ సంగీత దర్శకుడు.



'బొమ్మల కొలువు'లో జయమాలిని

## సర్కస్ రాముడు లో వృథాగా బోడిగుండు

తాయారమ్మ (యూన్ని) బోడి తల చూసి భాస్కరరావు (రావుగోపాలరావు) అదిరిపడ్డాడు: "ఏమిటే! నీకేం పోయేకాలం వచ్చిందే – నేను బ్రతికేవున్నాను కదే!"

"అయ్యో! ఛీ ఛీ! అవేం పాడుమాటలండీ! గుండు కొట్టించింది మీగురించి కాదు మన రాజా మామూలు మనిషయితే గుండు కొట్టించుకుంటానని స్వామికి మొక్కుకున్నాను," అంది తాయారమ్మ.

"నీ పిండాకూడు! వాడు రాజా కాదు!"

"ఏవిటీ! రాజా కాడా?"

"వ్చ్! కాదే!"

"మరిప్పుడు రాజా కాదన్నారు?"

"నేను కాదన్నది వేరు, వల్లకాడు."

ఇంతలో, వారి కూతురు జయ (జయప్రద) వచ్చి, "ఏమిటి, నాన్నా? కాదేమిటి? వల్లకాదేమిటి? రాజా ఏమిటి?" అంది విస్మయంతో.

"అబ్బా! కాస్త ఆలోచించుకోనివ్వండి. ఇదుగో – మధ్యాహ్నం మీ అమ్మను బజారుకు తీసుకెళ్లి, ఆ గుండుకు తగ్గ విగ్గు ఒకటి చేయించు," అని చెప్పి భాస్కరరావు నెత్తి బాదుకుంటూ వెళ్లిపోయాడు. తల్లీ కూతుళ్ళు తెల్లబోతూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

ఎన్. టి. ఆర్ ద్విపాత్రాభినయం నిర్వహించే కె. సి. ఫిలిమ్స్ ఇంటర్నేషనల్ వారి "సర్కస్ రాముడు" వన్నెల చిత్రంలో సుజాత, సావిత్రి, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, కె. వి. చలం, ఏ...త్రి, వీరభద్రరావు ఇతర ముఖ్య భూమికలు నిర్వహించారు. మహదేవన్ సంగీతం, కన్నప్ప ఛాయ, భాస్కరరాజు శిల్పం, బాలు కూర్పు, రేలంగి నరసింహారావు – హరిశ్చంద్రరావు సహదర్శకత్వం తెర వెనుక హంగులు.

డిసెంబర్ 29 న న్యూవుడ్‌లాండ్స్‌లో ఇచ్చిన విందులో ఈ చిత్ర నిర్మాత కోవై చెళియన్ ప్రసంగిస్తూ, "గతంలో, నేను అగ్రశ్రేణి తారాగణంతో తమిళంలో ఎన్నో భారీ చిత్రాలు తీశాను. ఏ చిత్రాన్నీ ఇలా అనుకున్న వ్యవధిలో పూర్తి చేయలేకపోయాను. 26 రోజుల్లోనే – షెడ్యూల్ ప్రకారం నేను పూర్తిచేసిన తొలి చిత్ర మిదే. అందుకే ఈ చిత్రనిర్మాణంలో పాల్గొన్న వారందరికీ అభినందనసూచకంగా ఈ విందు ఏర్పాటు చేశాను అహర్నిశలూ చిత్తశుద్ధితో కృషిచేసే డైరెక్టర్ దాసరి నారాయణరావుగారు ఎప్పుడు రెడీ అంటే- అప్పుడు నేనే 'సర్కస్ రాముడు' చిత్రాన్ని హిందీలో తీయడానికి రెడీ," అన్నారు

"చలనచిత్ర నిర్మాణంలో ఎంతో అనుభవజ్ఞులైన కోవై చెళియన్‌గారు మామీద పూర్తి విశ్వాసంతో ఈ చిత్ర నిర్మాణ భారాన్నంతా నామీద వుంచారు గనుకే మరింత బాధ్యతతో అనుకున్న వ్యవధిలో ఆశించినంతకన్నా మిన్నగా తియగలిగాం గనుక ఈ క్రెడిట్ అంతా వారిదే. ఇది మాకు అభినందనకాదు; చెళియన్‌గారి 49 వ జన్మదినోత్సవ సందర్భంగా మేమే ఆయన్ని అభినందించే అవకాశం మాకిలా కలిసివచ్చింది," అన్నారు డైరెక్టర్ దాసరి నారాయణరావు

## "ఎంత ఘాటు ప్రేమయో"

నవశక్తి పిక్చర్స్ పై పేరున ఒక చిత్రాన్ని నిర్మిస్తుంది వాసమూర్తి నవల "జీవిత సమరంలో" ఆధారంగా సత్యానంద్ సంభాషణలు రాస్తున్నారని తెలియజేశారు నిర్మాత పి నారాయణరావు. పి నారాయణరెడ్డి గీతాలకు సత్యం స్వరకల్పన చేస్తారు "జనవరి 25 నుంచి ఫిబ్రవరి 25 వరకు హైద్రాబాద్ నగరంలో ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది" అన్నారు డైరెక్టర్ పర్వతనేని సాంబశివరావు. సమర్పణ: పి. నాగేంద్రరావు



# సినిమా

## 'శంకరాభరణం'లో శాంతారాం, డాక్టర్ శ్రీరామ్‌లఘు, సంధ్య

జనవరి 1న ఒక చక్కటి 'తెలుగు' చిత్రాన్ని చూసేసరికి నూతన వత్సరారంభంలోనే ఇదొక శుభసూచకమూ — అనిపించింది; నాకే కాదు; చాలా మందికీనూ. మనకూ ఓ డైరెక్టర్ శాంతారాం, నటుడు శ్రీరామ్‌లఘు, నటి — నర్తకి సంధ్య ఉన్నారన్న భావం కలుగుతుంది పూర్ణోదయా ఆర్ట్ క్రియేషన్స్ వన్నెల చిత్రం "శంకరాభరణం"లో కె విశ్వనాథ్ దర్శకత్వపు ప్రతిభ, జె. వి సోమయాజులు, మంజుభార్గవి నటనా వైదుష్యం చూస్తుంటే. నత్తగుల్లలా నడవక, చక్కని టెంపోతో చకచక సాగే జనరంజకమైన చిత్రాలూ అవార్డులకు నోచుకుంటాయనే ఆశాభావం కలిగించే చిత్రం "శంకరాభరణం" ఈ ఏటి అత్యుత్తమ చిత్రాన్ని ఈ సంవత్సరారంభంలోనే చూశామన్న తృప్తిని పరిశ్రమలోని పలువురు వెలిబుచ్చారుకూడా. శంకరశాస్త్రి పాత్ర కోసం జె. వి. సోమయాజులు పుట్టారా, లేక ఆయన కోసం ఆ పాత్ర పుట్టిందా అన్న విస్మయం ఎవరికైనా కలుగక మానదు... అదివరకు ఆపిల్ పండు చెట్టునుంచి రాలి కింద పడడం ఎందరో చూసినా, గురుత్వాకర్షణశక్తివల్లే ఆ పండు భూమిమీద పడగలిగిందని న్యూటన్ చెప్పేవరకు ఆ రోజుల్లో ఎవరికీ ఎలా తెలియలేదో — అలాగే, నర్తకి మంజుభార్గవిలో ఒక చక్కని నటి ఉందని విశ్వనాథ్ ఈ చిత్రం ద్వారా బహిర్గతం చేశాకే చాలామందికి తెలిసింది. మితిమించని సంభాషణలతో, కేవలం హావభావాలతో కూడా సన్నివేశాలను గర్భింపచేయవచ్చని — కాలగర్భంలో కలిసిపోయిన వాహినీవారి చిత్రాలను తలపుకు తెస్తారు విశ్వనాథ్ చంద్రమోహన్, కొత్త నటి రాజ్యలక్ష్మి జంట చూడముచ్చటగా ఉంటే — అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, నిర్మల చక్కని రిలీఫ్ అందించారు సాంకేతిక నిపుణుల సమిష్టి కృషి



'ఛాలెంజ్ రాముడు'లో ఎన్. టి. ఆర్



కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది రీ రికార్డింగ్‌లోనూ కొత్తపుంతలు తొక్కిన ఈ చిత్రం తమిళనాడులోనూ, కర్నాటక రాష్ట్రంలోనూ మరింత బ్రహ్మాండంగా నడుస్తుంది — అక్కడి చలనచిత్ర ప్రియులు ఏ భాషలోని ఉత్కృష్టమైన చిత్రాన్నీ బాగా ఆదరించి గౌరవిస్తారు గనుక మన రాష్ట్రంలోకన్నా ఇతర రాష్ట్రాలలోనే మన చిత్రమేదైనా 'జూబ్లీ' చేసుకుంటేనేకదా మనవాళ్ళు గర్వించేది — సిగ్గుపడడానికి బదులు!

నేనిలా రాసినందుకు ఎవరైనా వెకిలిగా నవ్వుకోవచ్చు భూమి గుండ్రంగా ఉందన్న వాస్తవాన్ని తొలుత గెలిలియో వెలిబుచ్చినప్పుడు కూడా కొందరు వెకిలిగా నవ్వుకున్నారట.

నవనాగరికతతోపాటు సంగీత, కళల పోకడలు నేడు వెర్రితలలు వేస్తున్నా—చివరికి ఏనాటికైనా మన నిర్దుష్టమైన శాస్త్రీయ సంప్రదాయాల వంకే మన అభిరుచులు మరలుతాయని ఈ చిత్రం చాటిచెప్పినట్లే — మన చలన చిత్రాలలోనూ పవిత్రమైన, పరిశుద్ధమైన భావాలనే గతంలోవలె ఆదరించేలా ప్రేక్షకులలో ఉత్తమాభిరుచులను పెంపొందించే చిత్రం "శంకరాభరణం". భూమి గుండ్రంగా ఉంది మరి...!

నిర్మాతలు ఏడిద నాగేశ్వరరావు, ఆకాశం శ్రీరాములు ఎంతైనా అభినందనీయులు.

## ఇతర భాషలలో విశ్వనాథ్ చిత్రాలు

పూర్ణోదయా ఆర్ట్ క్రియేషన్స్‌వారి ఇదివరకటి విశ్వనాథ్ చిత్రం ''సిరి సిరి మువ్వ''కు తమిళనాడులో విశేషమైన ప్రేక్షకాదరణ లభించినా—తమిళంలో మరొక సంస్థ పునర్నిర్మించడానికి పూనుకోవడం ప్రత్యేకంగా పేర్కొనవలసిన విషయం. ఇక, హిందీ రూపాంతరం ''సర్గమ్'' విడుదలైన చోట్లల్లా బహు విజయవంతంగా నడుస్తోంది. ఇటీవల ఈ రకం చిత్రానికి ఇంతటి ఆదరణ లభించడం చూడలేదంటున్నారు ఉత్తర భారతంలోని చలన చిత్రాభిమానులు. బొంబాయి వర్లి ప్రాంతంలోని 'సుందరం' థియేటర్‌లో ప్రేక్షకులు ''డప్లివాలే డప్లిబాజా'' పాటను మళ్ళీ ప్రదర్శించమని నానా గొడవచేసి, థియేటర్ యాజమాన్యాన్ని లొంగదీసుకున్నారు. రెండోసారి ప్రదర్శిస్తున్నప్పుడు తెరమీద నాణాలను విరజిమ్మారటకూడా. మర్నాడు ఆ థియేటర్‌లోపల ఊడ్చిన వారికి దాదాపు వంద రూపాయలదాకా దక్కాయిట. పూనేలోని వసంత్ థియేటర్‌లో 9వ వారం దాటినా ఇంకా అడ్వాన్స్ బుక్కింగ్స్‌తోనే అక్కడ ''సర్గమ్'' ప్రదర్శింపబడుతోంది. పోతే, తమకు హిందీలో చిత్రం తీసిపెట్టమని విశ్వనాథ్‌ను ఎందరు బొంబాయి నిర్మాతలు కోరినా — 'నాకు తెలుగు చిత్రాలు చాలులెండి,' అని ఆయన జవాబివ్వడం ఆయన వాదస్తమే అనుకోవాలి.



'కళ్యాణ రాముడు'లో శ్రీదేవి

## ''నమ్మలేని నిజాలు''

''చిన్నపిల్లల మనోభావాలకు, భయాలు ఎలాంటి పరిణామాలకు దారితీస్తాయనే ఇతివృత్తం ఆధారంగా సుంకు సంతోష్ ఒక చక్కని కథ అల్లారు. భూతప్రేతాలకు సంబంధించిన విచిత్రమైన సంఘటనలను ఎవరైనా మా (మంజు ఫిలిమ్స్ 4–2–1069, రామకోటి, హైదరాబాద్–1) అడ్రసుకు తెలియజేస్తే, మా చిత్రంలో చేర్చదలిచాం,'' అన్నారు డైరెక్టర్ కె. ఎం. రెడ్డి. ''అగ్రశ్రేణి తారలతోపాటు కొందరు ఔత్సాహికులకు — ముఖ్యంగా 5–12 ఏళ్ళ మధ్యనున్న ఏడుమంది బాలలకు అవకాశమివ్వదలిచాం,'' అన్నారు ఈ చిత్ర నిర్మాతలు కె. నాగేశ్వరరావు, బి. ఎ., ఎన్. మహేంద్ర, ఎం. కామ్., ఎల్. ఎల్. బి., హార్స్‌లీహిల్స్, నల్లమల అడవుల్లో, శ్రీశైలం ప్రాంతాలలో చిత్రీకరణ జరుగుతుంది. నిర్వహణ : ఎల్. వి. రమణ. ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ : బి. పురుషోత్తం. ఈ ''నమ్మలేని నిజాలు'' చిత్రం మంజు ఫిలిమ్స్ పతాకంలో తయారవుతుంది



## ''టాక్సీ డ్రైవర్''

''జనవరి, ఫిబ్రవరి, మార్చినెలలో షూటింగ్ ఫినిష్ చేస్తాం. నూతన్ ప్రసాద్ ప్రధాన పాత్రధారి'' అన్నారు పై చిత్రానికి దర్శకత్వం వహించే కట్టా సుబ్బారావు. రాజ్యలక్ష్మి కంబైన్స్ పతాకంలో కె. ఆర్. వి. ప్రసాదరావు, యు. ఎస్. ఆర్. మోహనరావు నిర్మాతలు. గొల్లపూడి కథ, మాటలు రాశారు. మోహనకృష్ణ ఛాయాగ్రాహకుడు.



'నాయకుడు – వినాయకుడు'లో మంజుభార్గవి

## "సంఘం చెక్కిన శిల్పాలు"లో సంఘం వేసిన సంకెళ్ళు

నుదుట కుంకుమ, తలలో పూలు పెట్టుకున్న ఉదయను చూసి నిర్ఘాంతపోయింది అన్నపూర్ణమ్మ "ఏమిటమ్మా ఇది ? అపలేం చేశావో నీకుతెలుసా ? తీసెయ్యమ్మా, ఆ పువ్వులు తీసెయ్ !"

ఉదయ పిచ్చిదానిలా చూస్తూ, "ఏమ్మా, ఇలా నా నొసట కుంకుమతో, తల నిండా పువ్వులతో ఉండడం నువ్వు చూడలేకపోతున్నావా ?" అంది.

ఇంతలో అటు వచ్చిన ఉదయ అన్న మురళి "అవునమ్మా ! వాటి విలువేమిటో తెలియని చిన్నతనంలో వద్దని మారాం చేస్తున్నా – ఆడపిల్లకు తిలకమే అందమని, బలవంతాన తిలకం దిద్ది, పువ్వులు పెట్టి గాజులు తొడిగావు. ఈరోజు వాటి విలువేమిటో తెలిసి—కావాలని అది మనసారా కోరుకుంటూంటే, వద్దంటున్నావా ? పుట్టగానే మా ఇంట్లో మహాలక్ష్మి పుట్టిందని నాన్నా నువ్వూ మురిసిపోయారే! ఆనాటి మహాలక్ష్మి ఈనాడు ఎందుకూ కాకుండా పోయిందమ్మా ? ప్రతి ఆడదాని జీవితంలో భర్త ప్రవేశిస్తూ తీసుకొచ్చేది మంగళసూత్రాలు, మట్టెలేనమ్మా అతనుపోగానే తీసెయ్యాల్సినవి అవేగాని, పసుపు కుంకుమలు కాదమ్మా. చదువుకుంటున్నదాన్ని బలవంతాన పీటలెక్కించి, మెడలు వంచి ఈ పెళ్ళి చేశారు. ఈనాడు అందవిహీనంగా చేసి, మూల కూర్చోబెట్టారు ఏం, దానికామాత్రం కోరికలుండవా? దాని బ్రతుకు తెల్లారిపోవల్సిందేనా ? చెప్పమ్మా !" అన్నాడు

అన్నపూర్ణమ్మ "బాబూ, ఏమని చెప్పనురా ! సాటి ఆడదానిగా కాకపోయినా – కన్నతల్లిగా దాని బాధను అర్థం చేసుకోగలను. ఏ కన్నతల్లయినా – కూతురు కళ్ళముందు కళకళలాడుతూ కనిపించాలనే కోరుకుంటుంది. కడుపు చించుకుని కన్నానే గాని, దాని కన్నీరు తుడవలేని నిర్భాగ్యురాలినిరా నేను !" అంది ఖేదంతో.

ఉదయ ఆవేశంతో "సంఘం, వంశం, గౌరవం, ఆచారం – ఇన్ని సంకెళ్ళతో ఆత్మవంచన చేసుకుంటూ నేనెందుకు బ్రతకాలమ్మా?" అంటూ పువ్వులు తీసేసి, బొట్టు తుడుపుకుంటూ లోపలికెళ్ళిపోయింది.

తల్లీ కొడుకులు బరువుగా నిట్టూర్చారు.

విజయనిర్మల స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో కృష్ణ సమర్పించే శ్రీ విజయకృష్ణా మూవీస్ "సంఘం చెక్కిన శిల్పాలు" వర్ణచిత్రాన్ని తోటకూర ఆశాలత కథ ఆధారంగా ఎస్. రఘునాథ్ నిర్మిస్తున్నారు. అప్పలాచార్య, రమేష్‌నాయుడు, పుష్పం గోపీకృష్ణ, కొండపనేని రామలింగేశ్వరరావు, ఆదుర్తి హరనాథ్, ఎస్. రవికుమార్, ఎస్. రమానంద్ తెర వెనుక కృషి చేస్తున్నారు.

## విజయనిర్మల దర్శకత్వంలో మరో చిత్రం

కృష్ణ, సుజాత తొలిసారిగా నటించే వర్ణచిత్రాన్ని విజయనిర్మల స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో రవి కళామందిర్‌వారు నిర్మిస్తారు. చంద్రమోహన్ మరో ముఖ్య పాత్రధారి. "ఫిబ్రవరిలో షూటింగ్ ప్రారంభిస్తాం" అన్నారు నిర్మాతలు ఎం. ఎస్. ప్రసాద్, ఆదుర్తి భాస్కర్. జంధ్యాల సంభాషణలు, మహదేవన్ సంగీతం, ఆదుర్తి హరనాథ్ కూర్పు ఇతర ఆకర్షణలు.

## "లవ్ బర్డ్స్"

"పూర్తిగా విజయవాడ పరిసరాలలో చిత్రీకరింపబడుతుంది," అన్నారు రత్నా ఇంటర్నేషనల్‌వారి పై చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఎం ఎల్., ఈయన 'బాపు' శిష్యుడు హరిప్రసాద్, పి. ఎల్. నారాయణ, విజయ్, బాబు, కె. వి. చలం, గీత, సువర్ణ, పి. ఆర్. వరలక్ష్మి, నిర్మల, కొత్త నటుడు ఎస్. ఎన్. కుమార్ పాత్రధారులని తెలియజేశారు నిర్మాత ఎస్ వెంకట్రావు తోటకూర ఆశాలత కథకు శ్రీ రమణ సంభాషణల కర్త, ఆత్రేయ, సి నారాయణరెడ్డి గీతాలకు పుహళేంది బాణీలు కూర్చారు. భాస్కరరాజు శిల్పం, అత్మ కూర్పు, శ్రీనివాసరెడ్డి సహదర్శకత్వం నిర్వహిస్తారు.

## దాసరి దర్శకత్వంలో మరికొన్ని చిత్రాలు

ఎన్. టి. ఆర్. తో క్రాంతికుమార్ నిర్మించే అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైసెస్‌వారి చిత్రం జూలైలో, శ్రీమతి అన్నపూర్ణ సమర్పణలో వెంకట్ అక్కినేని నిర్మించే అన్నపూర్ణా స్టూడియోస్ చిత్రం ఆగస్టులో, మోహన్‌బాబు ప్రధాన పాత్రధారిగా వెంకట్రావు నిర్మించే



## సినిమా

సాయిబాబా ఫిలిమ్స్ "కేటుగాడు" చిత్రం, జగదీశ్‌ప్రసాద్ నిర్మించే లలితా మూవీస్ చిత్రం, జి వి. ఎస్. రాజు నిర్మించే విజయలక్ష్మి మూవీస్ "బంగోడు గుండోడు" చిత్రం మార్చిలో, వడ్డె రమేష్ నిర్మించే విజయమాధవి పిక్చర్స్ "బెబ్బులి–పులి" మేలో ప్రారంభమవుతాయి. "ఏడంతస్తుల మేడ" హిందీ అవతరణలో జితేంద్ర హీరో.

### "పల్లె నవ్వింది"

శ్రీ శ్రీనివాస కళామందిర్ పిక్చర్స్ నిర్మించే పై పల్లెల చిత్రంలో చంద్రమోహన్, నూతన్ ప్రసాద్, ప్రసాద్‌బాబు, వంకాయల, చిట్టిబాబు, సాక్షి రంగారావు, కిరణ్‌బాబు, జ్యోతి, ఉషాచౌదరి, ధనశ్రీ, శ్రీవిజయ, టి రాజేశ్వరి పాత్రధారులని డైరెక్టర్ పింజల భాస్కరరావు వివరించారు. శ్యామలరావు కథకు బొల్లిముంత సంభాషణలకర్త. జి. కె. వెంకటేశ్ స్వరలహరిలో జాలాది గీతాలు రాశారు. కె. ఎస్. రావు ఛాయ, గోవిందస్వామి కూర్పు, జె. బి రవీంద్రన్ సహకార దర్శకత్వం వహించే ఈ చిత్రాన్ని సి హెచ్ రాఘవరావు, ఎస్. విష్ణువర్ధనరెడ్డి నిర్మిస్తున్నారు.

### పద్మావతీ ఇంటర్నేషనల్

"నా ఇల్లు — నా వాళ్ళు" అనంతరం డాక్టర్ టి. కె. ఎం. ఛటర్జీ నిర్మించే కొత్త చిత్రంలో మురళీమోహన్, శ్రీధర్, నూతన్ ప్రసాద్, గిరిబాబు ముఖ్యభూమికలు నిర్వహిస్తారు. జంధ్యాల మాటలు, రాజన్–నాగేంద్ర సంగీతం, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం నిర్వహిస్తారు. తాతినేని వెంకట రామారావు సమర్పించే ఈ పల్లెల చిత్రానికి రాజాచంద్ర దర్శకుడు. మే 20నుంచి జూన్ 15 వరకు హైదరాబాద్ పరిసర ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుందని నిర్వహణ బాధ్యత వహించే కొల్లి రాఘవేంద్రరావు తెలియజేశారు.



'రాజాధి రాజు'లో విజయచందర్

### వికలాంగులకు పంజాబ్ ప్రభుత్వ వితరణ

14 ఏళ్ళలోపున ఉన్న అంధ, బధిర, మూగ వగైరా అంగవైకల్యం గల బాలలు వినోదపువన్ను చెల్లించకుండానే చండీఘర్‌లో చలన చిత్రాలు చూసే అవకాశం కల్పించబడింది. ఇందుకోసం ప్రవేశ కట్నం మాత్రమే గల కొన్ని టిక్కెట్లు ప్రత్యేకంగా ముద్రింపబడ్డాయట.



'సంఘం చెక్కిన శిల్పాలు'లో సునంత, సునీత



'పగటి కలలు'లో కవిత

# ఇతర రాష్ట్రాల సమాచారం

## సెన్సార్ బోర్డ్ తమాషా

హెన్రీఫ్లెంగ్ విరచిత ''అంద్రమాన్'' మన దేశంలో పెక్కు కళాశాలల్లో పాఠ్యగ్రంథంగా ఉంది. దాని ఆధారంగా తయారైన చిత్రాన్ని మన దేశంలో సెన్సార్ నిషేధించింది విశ్వవిఖ్యాత నాటకం ''ఈక్వస్'' ఆధారంగా తయారైన చిత్రానికి కూడా ఇదే గతి పట్టింది.

## పాక్ క్రికెట్ అభిమానులకు ఉచితంగా సినిమా ప్రదర్శనలు

నార్త్ బోర్డ్ క్రికెట్ పందెం చూడ్డానికి సరిహద్దులు దాటి మన దేశంలోకి ప్రవేశించిన దాదాపు 15 వందలమంది పాకిస్తానీయులకోసం అమృత్‌సర్‌లో కొన్ని చిత్రాలు ఉచితంగా ప్రదర్శింపబడ్డాయి. ''పాకీజా'' చిత్రం అందర్నీ అమితంగా ఆకర్షించింది. పాక్ క్రికెట్ క్రీడాకారులు కూడా నవంబర్ 28న అక్కడ క్రికెట్ 'పిచ్' ఎలా ఉందో చూసుకోకుండా సరాసరి మన హిందీ చిత్రాలు చూడ్డానికి ఎగబడ్డారట

కేరెక్టర్ ఆర్టిస్ట్ ప్రాణ్‌కు క్రికెట్ అంటే ఎంతో పిచ్చి. ఢిల్లీలో రెండవ టెస్ట్‌లో ప్రతిభా విశేషాలను ప్రదర్శించిన అసిఫ్ ఇక్బాల్, సునీల్ గవాస్కర్, సికిందర్‌బక్త్, కపిల్‌దేవ్, యాస్పాల్ శర్మ, దిలీప్ వెంగాస్కర్ లకు ఆరు బంగారు పతకాలను బహూకరించాడు ఆ టెస్ట్‌లోనే పాకిస్తానీ క్రీడాకారులు వాసిమ్‌రాజా, సికందర్‌బక్త్ లకు వాళ్ళ అధ్యక్షుడు జియా-వుల్-హక్ రెండు బంగారు పతకాలను ప్రకటించాడు.

## హైద్రాబాద్‌లో లత నృత్యం

అలనాటి తార కమలాకోట్నీస్ హైదరాబాద్‌లో 15 మంది వయోజనులకు ఆశ్రయమిచ్చే ఒక ఉచిత శిబిరాన్ని నెలకొల్పడానికి నిశ్చయించారు. తొలుత పాతికవేలు విరాళమిస్తూ, ప్రతి నెలా వెయ్యి రూపాయల చొప్పున ఇవ్వడానికి నిశ్చయించారు. అంతేకాక మరికొంత సహాయనిధి సేకరణ కోసం తన అక్క కూతురు నటి లతతో పాటు హేమమాలిని నృత్య ప్రదర్శనాన్ని కూడా జనవరి 27న హైదరాబాద్‌లో ఏర్పాటు చేసినట్లు నుడివారు

## పాత్రికేయులపై సినీ నటి దుమారం

మన దేశంలో కొన్ని పత్రికలు సినీ నటులను దుమ్మెత్తి పోస్తుంటాయి కాని, ఇంగ్లండ్‌లో డయ్నా డోరిన్ అనే నటి స్వయంగా ఒక పత్రికను నెలకొల్పి, ఎన్నో సినిమా పత్రికల గురించి, వాటి రిపోర్టర్‌లను, విమర్శకులను దుమ్మెత్తి పోస్తోందట.

## సినీ కథా రచయిత్రిగా మరో నటి

నటీమణులు భానుమతి, షీలా సినిమాలకు కథలు రాశారు. ఆ జాబితాలోకి కొత్తగా చేరింది శ్రీప్రియ నటి అవడానికి ముందు ఈమె అసలు పేరు అలిమేలు. ఆ పేరుతోనే ఈమె శ్రీ మహామాయ ఎంటర్‌ప్రైసెస్ వారి తమిళ చిత్రానికి కథ రాసింది. అత్త పాత్ర ధరిస్తుందట కూడా. లక్ష్మికి కూడా ఒక చిత్రానికి కథ రాయాలని వుందట. 

## ఒక సన్నివేశంలో పెక్కు అగ్రశ్రేణి తారలు

ఇటీవల ఓ రోజు బొంబాయి ఫిల్మిస్తాన్ స్టూడియో ముందు ఎన్నో డాట్సన్, టయోటా, చెవీస్ లాంటి అతి ఖరీదైన కార్లు బారులుతీరి ఉన్నాయి వాటినుంచి దిగిన రాజ్‌కపూర్, ధర్మేంద్ర, రాజేష్‌ఖన్నా, షమ్మీకపూర్, రణధీర్ కపూర్, విజయ్ అరోరా, రాకేష్‌రోషన్, ప్రేమ్‌చోప్రా, దేవ్‌కుమార్, మిథున్ చక్రవర్తి, మోహన్‌చోటి, మాలాసిన్హా, సిమీగరేవాల్, వహీదారెహమాన్, షర్మిలాటాగూర్, బిందు, ఇంద్రాణిముఖర్జీ, సింపిల్‌కపాడియా, ప్రేమ్ నారాయణ్, కోమిల్లావిర్క్, రంజీతలను గెస్ట్‌లుగా ఎం. కె. డి. ఫిలిమ్స్ ''నసీబ్'' చిత్రంలో సమావేశపరచే ఘనత డైరెక్టర్ మన్‌మోహన్ దేశాయ్‌కి దక్కింది. ఈ సన్నివేశంకోసం అంతకు ముందు రోజు 13 తాత్కాలిక మేకప్ గదులను హుటాహుటీగా నిర్మించారు. ఫైవ్ స్టార్ హోటల్‌లోని పెద్ద హాలు సెట్‌లో ''మన్‌మోహన్ దేశాయ్ హిట్ చిత్రం 'ధర్మవీర్' స్వర్ణోత్సవం'' అంటూ పెద్ద బోర్డు. చుట్టూ రంగు రంగుల బెలూన్‌లు, దీపాలు. హోటల్ వెయిటర్‌గా పాల్గొనే అమితాబ్‌బచ్చన్ ఆ గెస్ట్ తారలను రంజింపచేస్తూ ఒక పాట పాడుతాడు. అందుకోసమన్న మాట అంత కోలాహలం.



'అందాల రాశి'లో రతి

## సామాన్యుని సణుగుడు

# 'క్రికెట్' ఆడాలేగాని యుద్ధం చెయ్యకూడదు!

ఎంత వ్యాపారమైనా కొంత 'యిది' వుండాలి. మరీ బ్యాటింగ్‌కి హెల్మెట్లు — ఫీల్డింగుకి హెల్మెట్‌లు అల్యూమినం బ్యాట్‌లు, యినపమడమల బూట్లు ఏమిటిదంతా?.. క్రికెట్ నైపుణ్యం, కౌశల్యం చూపించి, పాలమీగడ లాంటి దుస్తులు ధరించి, శీతాకాలపు ఎండలో ఆబాలగోపాలం ఎదుట — లక్షలాది జనాలు, పని పాటలకి 'ఫ్రెంచిలీవ్' పెట్టేసి, కాలక్షేపంగా రేడియోలు విని తమాషా కలిగిస్తూంటే ఆడే ఆటేగాని, 'యుద్ధం' కాదు 'బాక్సింగ్' 'రెజ్లింగ్' ల్లాంటి మొరటు వ్యవహారం కూడా కాదు! దాన్ని ఆడే ఉత్తేజంతో ఆడాలి. అంతేగాని సర్కస్సు, ఎగ్జిబిషన్ లాంటి వ్యాపారంగా మార్చేస్తున్నారు!

ఈ పాకిస్తాన్ జట్టు రాకముందు నుంచి యీ 'టీము' అంత గొప్పది — ఇంత గొప్పది —. "పొడిచేస్తుంది పచ్చడిచేస్తుం"దీ! అంటూ పత్రికలు, మన ప్లేయర్‌లూ కూడా గోరంతలు కొండంతలుగా, అట్టహాసంగా చెప్పుకునేసరికి — వాళ్ళు "నిజం" అనుకొని పళ్లేరుమీద బండీలం అనుకుంటూ వచ్చారు — కాని మన కుర్రకారు జట్టులో కపిల్‌దేవ్, యశపాల్, ఘావ్రీ, యాదవ్, పేరైన ఆస్ట్రేలియా జట్టును ఓడించి హుషారుగా వున్నారు సీనియర్‌లు!

మిగతా దేశాల మాట ఎట్లావున్నా మన దేశంలో మాత్రం క్రికెట్ "ఫాన్స్" యెవడు బాగా ఆడితే వాడికే బ్రహ్మరథం పడతారు రంగు, దేశం, మతం జాతిలాంటివి అస్సలు చూడరు — ఆసిఫ్‌యిక్బాల్‌కి, జాహీర్ అబ్బాస్‌కి, ఇమ్రాన్‌ఖాన్‌కి మనవాళ్ళు ప్రతివాసీలు పరిచారు కాదా?

బొంబాయిలో, "పిచ్" బాగులేదన్నాడు 'ఆసిఫ్' దాన్ని పాడుచేశారన్నాడు "యల్. బి డబ్ల్యూ"లు. "ఇవ్వకూడదు ... మా వాళ్ళకి" అన్నట్లు విసుక్కున్నాడు — అంపైర్‌ల మీద ఆరోపణలు చేశాడు. చాలామంది కాప్టెన్‌లకన్నా 'మిలటరీ' దేశం నుంచి వచ్చినా కూడా, ఈ "అబ్బాయి" కదిపితే చాలు "గలగలా మాట్లాడేస్తున్నాడు" "ఇదేం టెస్టు పిచ్?" అన్నాడు మూడో టెస్ట్ అప్పుడు ... మనం బాగా జ్ఞాపకం చేసుకుంటే — మన "బేడీ" పాకిస్తాన్‌లో యిట్లాంటి కామెంట్‌లు చేస్తేనే, గ్రౌండులో యిలాంటి అల్లరిచిల్లరి పనులు చేస్తేనే, మనం



ఆసిఫ్ యిక్బాల్

### జంటిల్మన్ గేమ్ యిది

— ఏది ఏమైనా 'గవాస్కర్' భయపడ్డట్లు మన 'టీము' పనటరకం కాదు — కపిల్‌దేవ్ బ్యాటింగ్‌లో యింకొంచెం 'దిగువకి పోతే — స్థిమితపడతాడు — చాకులాంటి కుర్రాడు బౌండరీ లైను దగ్గర్నుంచి, మైదానం దున్నుతూ నిప్పులు కురుస్తూ, 80 గజాల దూరం పరిగెత్తకుండా, 'స్వింగ్' చేసి ఫాస్ట్ బాల్స్ వేస్తే చాలునన్న ఘనమైన సత్యాన్ని కపిల్ రుజూ చేశాడు. రికార్డు (74) వికెట్‌లు తీసుకున్నాడు.

ఎల్లాంటా మంచి పరుసంలో వున్నారు అప్పటికే 'నాసి'దో, "హాట్టే"దో క్రికెట్‌కి పెట్టింది యిక్కడనుంచి మనవాడే అన్న ప్రేమ కూడా లేకుండా — తిట్టిపోశాం! తీసేశాం!!

### కాన్పూర్‌లో మాటేమిటి?

బొంబాయిలో 'పిచ్' బాగులేదన్నాడు — సరే.. కాన్పూర్‌లో ఇండియన్ టీము బ్యాటింగ్‌కి దిగింది — టాస్ గెలిచి మరీను — 'గవాస్కర్'ని రెండు పరుగులతో వెనక్కి పంపేసిన సికిందర్‌భక్త్, ఆ తర్వాత బంతిలోనే, వెంగ్‌సర్కార్‌ని కూడా, "డక్" చేసేసరికి, "పిచ్" పిచ్చిద"ని వెంటనే "ప్రొటెస్టు" చెయ్యలేదే ఎవ్వరూ? విశ్వనాథ్ (2) కే పడిపోగా ఇండియా, 69 పరుగులు చేసేసరికే 8 వికెట్‌లు "హత"మైపోయాయే?— ఈ ఆట స్థలాన్ని కూడా మనవాళ్ళే తయారు చేశారు — మరి దీనిమీద కేవలం 'స్పిన్నర్'లు లేకుండా ఫాస్ట్ బౌలర్‌ల మీద ఆధారపడ్డ పాకిస్తాన్ టీముకి ఎంత సునాయాసంగా వికెట్‌లు వొచ్చాయి? (ఆసిఫ్‌మియా ఏమంటాడు?) ఐతే భారత జట్టు 'తోక' [యాదవ్ (25), దోషి (20), ఘావ్రీ (45) లు] అంత తేలికగా ముడుచుకోలేదు — పైగా స్కోరు 162 దగ్గర ఆగింది — అసలు ఆట "యిట్నుంచి" "అటు", తోక నుంచి వోపెనింగ్ జంటకేసి ఆడినట్లుంది!

మరి యిది కూడా 'పిచ్' మహత్యమేనా? బాగా అలవాటైపోయింది క్రికెట్ కుర్రాళ్ళకి— ఆడితే తమ గొప్ప — పోతే "పిచ్" వంకర — వికెట్ "సొట్ట" అంపైర్‌లు "గుడ్డి" అనడం—



సికిందర్ భక్త్

### కాని యిదేం ప్రొటెస్టు?

కాన్పూర్ సెకండ్ యిన్నింగ్స్‌లో వెంగ్‌సర్కార్‌కి 'భక్త్' వేసిన బంతిని వికెట్‌కీపర్ 'బారీ' పట్టుకుంటే "హావీజ్దాట్" అని అరచిన సికిందర్ అంపైర్ అవుట్ యివ్వకపోతే, తిన్నగా దూసుకుపోయి తానే, వెంగ్‌సర్కార్ వైపున్న స్టంప్సుని కాలితో తన్నేశాడు వెంటనే ఆసిఫ్‌యిక్బాల్ క్యాప్టెన్‌గా అతన్ని మందలించాల్సింది కాని తాను కూడా బంతి పట్టుకుని దాన్ని "ప్రొటెస్టు" చేస్తున్నట్లు నేలకేసి కొట్టాడు!? ముదస్సర్‌నజార్ గూడా అంతే ... గవాస్కర్ మీద తన అప్పీలు అంపైర్ 'మహమ్మద్ గౌస్' కాదంటే, "వికెట్" మీద గవాస్కర్‌ని, అంపైర్‌నీ మింగుతానన్నట్లు అటూ యిటూ బెదిరింపు చూపులతో పులిలాగ పరుగులు తీశాడుట!? ఇది "పెద్దమనుషులాట" యిది "క్రీడాకారుల మధ్య పోటీ" — యిది "క్రికెట్", "దొర"లు నేర్పించిన గేమ్! యుద్ధం కాదు — దీన్ని దేశంలోని యువతరాన్ని ఉత్తేజపరిచేలాగ ఆరోగ్యవంతుల్ని చేసేలాగ ఆడాలి — లేదా ... మానెయ్యాలి. ఇది మీరు చదువుతూవుండేసరికి మద్రాసు టెస్ట్ పూర్తి అవుతూంటుందికాని రాస్తున్నప్పుడు "ఆసిఫ్‌యిక్బాల్" "ఫౌజ్" బంగ్లాదేశ్‌లో — ఇండియా మీద 'సీరీస్'ను లాక్కోడానికి, వ్యూహం వేస్తూంది వెయ్యాల్సిందే... కాని "వూను స్పర్థను విద్యలందే, వైరమూ ... వాణిజ్యమందే ..." నని మరిచి పోరాదుగా...

[వీరాజీ

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

**మంగళ వాయిద్యాలు మ్రోగుతున్నాయి. పందిట్లో కట్టిన పచ్చని మామిడాకుల తోరణాలు గాలికి అల్లల్లాడుతున్నాయి. పట్టుచీరల రెపరెపల్లో అత్తరు గుబాళింపులు చెలరేగి మత్తు గొలుపుతున్నాయి. కల్యాణ మండపంలో కూర్చునివున్న వధూవరులు రతీమన్మథుల్లాగ వున్నారు.**



# ఖాళీకుర్చీ

పెళ్ళికూతురు తండ్రి రామారావు పట్టుపంచె సర్దుకుంటూ హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. అతని ముగ్గురు తమ్ముళ్ళూ అన్నగారికి అండగా నిలబడి ఏర్పాట్లు చూస్తున్నారు.

రామారావు ఇండస్ట్రియలిస్టు, లక్షాధికారి, అంగబలం అర్థబలం వున్నవాడు. అతని పెద్దతమ్ముడు తాతారావు ఐ. ఏ. ఎస్. ఆఫీసరు. మధ్యప్రదేశ్ రాష్ట్రంలో కలెక్టరుగా పనిచేస్తున్నాడు. రెండో తమ్ముడు రాజారావు ఇన్‌కంటాక్సు ఆఫీసరు. కలకత్తాలో వుంటాడు. మూడోవాడు మాధవరావు రైసుమిల్లు ఓనరు. ప్రేమకీ, ఆప్యాయతకీ, అనురాగానికీ వాళ్ళు అందరూ రాముని తమ్ములవంటివారు ఈ అన్నదమ్ములు నలుగురికీ ముగ్గురు అప్పచెల్లెళ్ళు. అందరూ గవర్నమెంటు ఆఫీసర్ల భార్యలు. పచ్చపచ్చగా సంసారాలు చేసుకుంటూ పిల్లా పాపలతో సుఖజీవనం సాగిస్తున్నవాళ్ళు

పెళ్ళికి వూరు వూరంతా తరలివచ్చింది.

కొంచం అవతల పందిట్లో భోజనాలు సాగుతున్నాయి.

పెళ్ళి తతంగం ఆర్భాటంగా సాగిపోతున్నది. ముందు వరసలో సోఫాలో కూర్చుని అర్థ నిమీలిత నేత్రాలతో ఆనంద నిర్భరిత మయిన హృదయంతో గమనిస్తూవుంది అన్నపూర్ణమ్మ. రామారావు ఆమె జ్యేష్ఠ పుత్రుడు. ఇపుడు అతని కనిష్ఠ పుత్రిక వివాహం. పెళ్ళికొడుకు ఎక్సయిజు డిపార్టుమెంటులో పెద్ద ఆఫీసరు. సమానమయిన వియ్యం.

మంగళసూత్రధారణ జరుగుతోంది. ఒక యువతి పెళ్ళికూతురి జడని ఎత్తిపట్టుకుంది. పెళ్ళికొడుకు నిలబడి, వంగి మంగళ సూత్రం కట్టాడు. మంగళ వాయిద్యాలు మ్రోగాయి. అందరూ లేచివెళ్ళి అక్షింతలు వేసారు. అన్నపూర్ణమ్మని చిన్నపిల్లనిలాగ పొదివి పట్టుకొని నడిపించుకొని వెళ్ళాడు ఆమె పెద్దకొడుకు. అక్షతలు వేసి మనసారా ఆశీర్వదించింది. తిరిగి ఆమెని సోఫాలో కూర్చోపెట్టి వెళ్ళాడు రామారావు. రామారావు కొడుకు వచ్చి 'నానమ్మా, కూల్‌డ్రింక్ తాగు' అని అందించబోయాడు. 'వద్దురా' అని ఎంత మొత్తుకున్నా వినడు. బలవంతంచేసి తాగేదాకా వదిలిపెట్టలేదు. వాడు అంతే.

పెళ్ళికొడుకు పెళ్ళికూతురు తలంబ్రాలు పోసుకుంటున్నారు. సంతోషంతో అటు ఇటు పందిరంతా కలయజూసింది అన్నపూర్ణమ్మ. ఆమె చూపు తిరిగి తిరిగి ఒకచోట ఆగిపోయింది. రెండో వరసలో చివర కుర్చీలో కూర్చునివున్న ఒక వ్యక్తి — ఆమె దృష్టిని ఆకర్షించాడు. అతను బక్కపలచగా వున్నాడు. ఖద్దరుబట్టలు వేసుకునివున్నాడు. ఆబగా, అపేక్షగా, అనిమేషంగా పెళ్ళితంతును గమనిస్తున్నాడు.

అతను ఎవరి దృష్టికీ రాలేదు; అందర్నీ అతను గమనిస్తూవున్నాడు. అతన్ని గమనించి —

అన్నపూర్ణమ్మ గుండెలు గుబగుబలాడాయి.

మనసు రెపరెపలాడింది.

అచ్చం అదే పోలిక.

అన్నపూర్ణమ్మ గుండెలు ఎగసిపడినాయి. మరల మరల అటువేపు చూసింది ఆమె.

మనసు ఉత్తుంగ తరంగిత సముద్రంలాగా పొంగిసలాడింది. ఏమేమో చేయాలని పించింది. ఏమీ చేయలేకపోయింది.

ఆమె చిన్నకూతురు రెపరెపలాడుతున్న పట్టుచీరతో అటుగా వచ్చింది. వచ్చి —

'అమ్మా! భోజనం చేసావా?' అని అడిగింది.

లేదన్నట్టు తలాడించింది అన్నపూర్ణమ్మ.

టారు. అపురూపమయిన ఆప్యాయతల్ని అందించబోతారు. తల్లిని దైవసమానంగా చూసుకొనాలన్న ప్రయత్నం వాళ్ళ మాటలలో చేతలలో కన్పిస్తూవుంటుంది. అదే ఆమె తృప్తి; ఆనందమూ.

కాని వయసు మీదపడింది. ఆమెకి ఓపిక తగ్గిపోయింది. తింటే అరగదు




అయితే పద. భోజనం చేద్దువుగాని' అంది కూతురు.

'ఇపుడు నేనేం తినలేనే.'

'కొంచం పెరుగేసుకు తిందువుగాని.' బలవంతంచేసింది కూతురు. ఇంతకుముందు ఆమె మిగతా కొడుకులూ, కూతుళ్ళూ అందరూ వచ్చి అలాగే ఆమెని అన్నం తినమని బలవంతం చేసారు. అందరూ అంతే. తల్లిని మల్లెపూవులాగ చూసుకుం

అందువలన ఆహారం తగ్గించింది. ఆరముగ్గిన పండులాగ అయింది.

చిన్నకూతురు ఆమెని వదిలిపెట్టలేదు. బలవంతాన ఆమెని రెక్కపుచ్చుకుని లేపి మెల్లగా నడిపించుకుని వెళ్ళింది. ప్లేటులో ఇంత అన్నం పెరుగూ పెట్టుకునివచ్చి తినిపించింది. మూతి కడిగింది. ఆ తరువాత జాగ్రత్తగా తీసుకునివచ్చి సోఫాలో కూర్చోపెట్టింది తల్లిని.

పెళ్ళి చాలావరకు పూర్తవవచ్చింది. అరుంధతీ నక్షత్రం చూపించటం, చదివింపులూ అన్నీ అయ్యేయి. పెళ్ళికొడుకుని పెళ్ళికూతురుని లోపలికి తీసుకువెళ్ళేరు.

అన్నపూర్ణమ్మ దృష్టి రెండవ వరుసలో చివరి కుర్చీవైపు మళ్ళింది.

ఆమె గుండె గుబగుబలాడింది.

ఆ మనిషి — అచ్చం అదే పోలిక!

కాని ఇపుడు ఆ కుర్చీ కాళీగా వుంది!

అదేగాక పందిట్లో చాలా కుర్చీలు కాళీ అయేయి.

మనసే కాళీ అయినట్లనిపించింది ఆమెకి. గుండె మారుమూలలలో ఎక్కడో చిన్న కలక. కలవరం.

మంగళతూర్యరవాల మధ్యన మెడలో తాళి కట్టించుకున్న క్షణంలో అప్పుడు—కొన్ని దశాబ్దాల క్రితం — కొత్త పెళ్ళికూతురుగా ఎన్నో కలలుకంది. కడుపు పండాలని నూరేళ్ళు పచ్చగా కాపురం చేయాలని ఆశించింది. అందరు కన్నెపిల్లలులాగానే ఆశల పందిరి వేసుకుంది. కనిపెంచిన తలిదండ్రుల్ని, అన్నదమ్ముల్ని, అప్పచెల్లెళ్ళనీ అందర్నీ వదిలి — అతన్నే నమ్ముకుని అతనితో తరలి వచ్చింది.

బాగానే సాగింది తన సంసారం.

అందం అనురాగం, పాడీ పంటా, పిల్లాపాపా, ధాన్యం ధనం పుష్కలంగా వున్న సంసారం.

ఒకసారి 'అతని కారు' యాక్సిడెంటుకి లోనయింది. తలకి బలంగా దెబ్బతగిలింది. గాయం నయమయింది. కాని అప్పట్నుంచీ ఆ మనిషి మారిపోయారు.

అన్నపూర్ణమ్మకి ముగ్గురు అక్కలూ, నలుగురు అన్నలూ. అందరిలోకి చిన్నది అవటంవలన గారంగా పెరిగింది. అన్నలు ప్రాణసమానంగా చూసుకునేవారు అక్కలు ఆమెని కాలు కిందపెట్టనిచ్చేవారుకారు. ఆప్యాయతలు, అభిమానాలు గుండెల్నిండా నింపుకుని గడిపిన రోజులవి.

ఇప్పుడు అన్నపూర్ణమ్మ వయసు ఎనభయి దాటింది. జీవితంలో అన్నీ చూసింది. స్నేహితులు, అక్కలు అన్నలు—తలిదండ్రులు అందర్నీ కాలరాక్షసి మింగివేసింది. ఆ విషయం జ్ఞాపకంవస్తే గుండె చెరువవుతుంది. అత్తారుబత్తరంగా గడిచిన బాల్యం, కేవలం జ్ఞాపకాలుగానే మిగిలిపోయింది. ఆరోజులు తిరిగి రావాలని—

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలు పంప దలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ–520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరు మీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి– హామీ పత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు– వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకు వ్యవధి లేదు కాని–తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయ వలసివస్తే రచయితలు– రచన పేరు– అది పంపిన తేదీ, వివరంగా వ్రాయందే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతి కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్మ' వారికి తప్ప తతిమ్మా అందరికీ; అవి పడ్డ "ప్రతు"లను– కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. సం.



చీరాలలో డిసెంబర్‌లో జరిగిన అఖిలభారత ద్వితీయ ఫొటోగ్రాఫీ ప్రదర్శనల్లో బహుమతి పొందిన ఫొటో టి. కాశీనాథ్ తీసినది.

## ఖాళీ కుర్చీ

మరల ఒకసారి ఆ జీవితాన్ని పునశ్చరణ చేయాలని అనిపిస్తుంది. ఆ కోరిక గుండె లోతుల్లో కొట్టుమిట్టాడుతుంది. అది జరిగేపని కాదని తెలిసి మనసు నిట్టూరుస్తుంది. ఏడ్వలేక నవ్వు ఒకటి పెదాలపయిన పారాడుతుంది. అది జారిపోయిన స్మృతి. మధురగీతి. మరల అందుబాటులోనికి రానిది. తెచ్చుకొనలేనిది.

అన్నపూర్ణమ్మ చూపు మరల ఆ ఖాళీ కుర్చీల మధ్యన పారాడింది. ఎంతో ఆశతో వెతుకులాడింది. రెండోవరసలో వున్న ఆ చివరి కుర్చీలో కాకపోయినా మరే కుర్చీలోనయినా ఆ రూపు గల మనిషి కనిపిస్తాడేమోనని వెతుకులాడింది.

కేవలం పోలిక మాత్రమే.

పోలికని గుర్తించిన మనసు ఆశపడింది– అంతే.

కాని – కుర్చీలు ఖాళీగానే వున్నాయి. నిరాశే ఎదురయింది.

ఆ నిరాశ మనసులో విషాదాన్ని నింపింది. అప్పటినుంచీ – ఆ యాక్సిడెంటయిన

దగ్గరనుంచీ ఆయన పద్ధతి మారిపోయింది. మతి స్థిమితంగా వుండేదిగాదు. మనిషి ఇంటిపట్టున వుండేవారుకాదు. హఠాత్తుగా ఇల్లు వదిలిపెట్టి వెళ్ళిపోయేవారు. మరల ఎప్పుడో బుద్ధికుదిరినపుడు ఇల్లు చేరేవారు. మాసిన బట్టలు, లోతుకు పోయిన కళ్ళూ, పెరిగిన గడ్డము, పొడుచుకు వచ్చిన శరీరంలోని ఎముకలూ. ఆ ఆకారంలో ఆ మనిషిని చూసి ఏడుపు వచ్చేది.

'ఇన్నాళ్ళు ఎక్కడికి వెళ్ళారు ?'

'ఏమయిపోయారు ?'

'మమ్మల్ని వదిలిపెట్టి యెలా వుండగలిగారు ?'

'మీకు ఏం తక్కువ అయిందని అలాగ వెళ్ళిపోయారు ?' ఇవన్నీ ప్రశ్నలు. కాని ఆ ప్రశ్నలకి సమాధానాలు లేవు.

పిచ్చిగా చూసేవారు. వెర్రిగా నవ్వేవారు. శూన్యంలోకి చూస్తూ వుండిపోయేవారు. ఆ రావటం, పట్టుమని నాలుగురోజులన్నా వుండటం జరిగేదిగాదు. మరల తిక్కపుట్టి ఎప్పుడో అదృశ్యమయిపోయేవారు. శూన్యాన్ని మిగిల్చి తన దారి తను చూసుకునేవారు. పండయిన సన్నని జీవితంలో కాలి తొంగిచూసింది. బ్రతుకు ఆకాశంలో నల్లని మబ్బుతునక తొంగిచూసింది

పెళ్ళికూతుర్నీ, పెళ్ళికొడుకునీ బయటికి తీసుకువచ్చారు. మంచం వాల్చి ఎదురు బొదురుగా కూర్చోపెట్టారు. అంపకాలు జరుగుతున్నాయి.

పెద్దాడు కూతుర్ని అంపకంచేస్తున్నాడు. ఇన్నాళ్ళు అల్లారుముద్దుగా పెంచుకున్న కూతుర్ని అవతలవాళ్ళకి అప్పచెప్తున్నాడు. అన్నపూర్ణమ్మ గుండెలు బరువుగా మూలిగాయి.

బ్యాండువాళ్ళు అంపకాల పాట వాయిస్తున్నారు. చుట్టూరా నిలబడిన బంధుమిత్రులు బరువయిన మనస్సులతో చూస్తు వున్నారు. పెళ్ళికూతురు కళ్ళు వత్తుకుంది. తలిదండ్రులకి దండం పెట్టేటపుడు వాళ్ళని కావలించుకుని ఏడ్చింది. అది చూస్తువున్న అందరి కనులూ చమర్చాయి.

తనూ కళ్ళు తుడుచుకుని అన్నపూర్ణమ్మ నలువయిపులా పారజూసింది అతనికోసం. వెతికింది. వ్యర్థప్రయత్నమే అని తెలిసినా— వెతుకులాట మానలేకపోయింది.

అలాగ ఎందుకయింది ?

ఎందుకయింది ?

అని ఎన్నోసార్లు ప్రశ్నించుకుంది అన్నపూర్ణమ్మ. ఎందుకయిందో కారణం ఎవరూ చెప్పలేకపోయారు. అలాగ కొన్నిసార్లు ఇల్లు వదిలి వెళ్ళి తిరిగివచ్చాక— ఒకసారి వెళ్ళిపోయిన మనిషి తిరిగి రానేలేదు. ఈనాటికీ ఆయన అయిపూ అజా లేదు. అందరూ ఆయన్ని మర్చిపోయేరు. తను మర్చిపోలేదు

అప్పటికి — పెద్దాడు రామారావు ప్రయోజకుడయినాడు. మిగతావాళ్ళు చిన్న చిన్న పిల్లలు. రామారావు బుద్ధిమంతుడు. తమ్ముళ్ళనీ, చెల్లెళ్ళనీ అతనే అన్నీ అయి పెంచాడు. ప్రయోజకుల్ని చేసాడు. తను కేవలం నిమిత్తమాత్రురాలుగానే వుండి పోయింది.

అప్పుడప్పుడు ఆమెకి అన్పిస్తుంది. వీళ్ళు అందరూ కలిసిమెలిసి ఒకే గూట్లో వుంటే బావుండుననిపిస్తుంది. కాని — రెక్కలు వచ్చి ఎగిరిపోయి స్వంత గూడు కట్టుకున్న పక్షుల్ని పాత గూటికి రమ్మంటే వీలయేపనా ? ఉద్యోగ ధర్మాలు, జీవన వ్యాపారాలు వేరయి బ్రతుకు బండ్లని లాగుకుంటూవుండిన బిడ్డలు అందరూ ఒకచోటనే వుండటం అసాధ్యం గదా ! నిజమే. కాని రెక్కలు వచ్చి విహరించే కోరికల్ని అరికట్టటం ఎలాగ ? అందుకే అవి తీరని కోరికలుగా గుండెలోతుల్లోనే నిల్చిపోయాయి. బ్రతుకు చిత్రంలో మచ్చల్ని మిగిల్చాయి.

నలుగురూ అంటారు.

తనకేం లోటు. రాజుల్లాగ నాలుగు వయిపులా రాజ్యం చేస్తున్న నలుగురు కొడుకులు నిండుగా కాపురాలు చేసుకుంటున్న కూతుళ్ళు. మనవలు, మనవరాళ్ళు. అందరూ తనంటే ప్రాణం ఇస్తారు. ఆప్యాయత చూపిస్తారు. కాళ్ళు కడిగి నెత్తిమీద చల్లుకుంటారు. తనకి ఏ లోటూ రాకుండా వుండాలని — ఆ వయసులో అన్నీ సజావుగా జరగాలని తాపత్రయపడతారు. ప్రయత్న లోపం రానీయరు. భక్తి, గౌరవం, అభిమానం, ఆప్యాయత అందిస్తారు.

వాళ్ళని చూసి అన్నపూర్ణమ్మ కడుపు నిండుతుంది. వాళ్ళ వినయపూర్వకమయిన, ఆప్యాయత నిండిన ప్రవర్తన ఆమెకి వెయ్యి ఏనుగుల బలం ఇస్తుంది.

కాని — ఏమిటీ చిత్రం ?

ఈ జీవితం పరుగు పెడుతూవుంది ! కాలంతోపాటు పురుకులు పరుగులమీద సాగిపోతుంది. దానివెంట అంగలు వంగలు వేసుకుంటూ వాళ్ళు సాగిపోతున్నారు. తమతోపాటు ఆమెనికూడా తీసుకుపోవాలని ప్రయత్నిస్తూ వున్నారు. అందులో అసహజత్వం వుందనిపిస్తుంది. ఎక్కడో లోటు మిగిలివున్నట్లు కన్పిస్తుంది. వాళ్ళతో పాటు తను ఎన్నాళ్ళపాటు అలా వడక



మద్రాసులో కపాలేశ్వర ఆలయంలో పార్వతీ పరమేశ్వరులకు, ముక్కోటి ఏకాదశినాడు శ్రీ బి. రామలింగం సిద్ధాంతి శ్రీ ఎన్. టి.ఆర్ చేతిమీదుగా కిరీటధారణ చేయిస్తున్న చిత్రం

సాగించగలదు ? కాదని ఆగిపోయి, వాళ్ళని వదిలిపెట్టి ఎలాగ నిలబడిపోగలదు ?

తను ఏమయిపోతుంది ? ఏదో ఒకచోట తను ఆగిపోతే — అలాగ సాగి వెళ్ళిపోయిన 'వాళ్ళు' ఏమవుతారు ?

తనకి తోడుగా అయి—నీడని ఇవ్వవలసిన ఆ 'దేవుడు' ఏడి ? ఏమయిపోయాడు ? ఎందుకు ఇంత నిర్దయ ? పతినే ప్రత్యక్ష దైవంగా పూజించుకుంది మరి !

వాన కురిసి వెలిసినట్లయింది.

పెళ్ళివారు వెళ్ళిపోయారు. బంధుమిత్రులూ సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

రామారావు, అతని తమ్ముళ్ళు, చెల్లెళ్ళు వాళ్ళ సంతానాలు మాత్రం మిగిలిపోయారు. నెత్తిమీదనుంచి పెద్ద బరువు దింపుకున్నట్లు అయింది. తలపెట్టిన శుభకార్యం చాలా బాగా జరిగిపోయింది. ఆ తృప్తితో - అన్నపూర్ణమ్మగారి వద్దకు వచ్చి కుర్చీ లాక్కొని కూర్చున్నాడు రామారావు. అతని వెనకే తమ్ముళ్ళు వచ్చారు. ఆవెంట చెల్లెళ్ళు, ఆ కోడికోడళ్ళూ వచ్చారు. అందరూ తలా ఒక కుర్చీ లాక్కొని అన్నపూర్ణమ్మ చుట్టూ

# కాళీ కుర్చీ

పరివేష్టించారు. ముచ్చట్లు ప్రారంభించారు.

గుండెలోతుల ఆలోచన్లనుంచి బయట పడిన అన్నపూర్ణమ్మ తలతిప్పి చుట్టూరా చూసింది. తనను ఆవరించి —

కొడుకులు, కోడళ్ళు — కూతుళ్ళు, అల్లుళ్ళు, మనుమలు మనుమరాళ్ళు అంతా తన బలగమే. కొలువుతీరిన మహారాజ్ఞిలాగ అన్పించింది ఆమె.

ఆమె దృష్టివాళ్ళని దాటి పందిరంతా కలయనిరిగింది. ఆ పందిరంతా కాళీ కుర్చీలు. ఆ రెండో వరుసలో చివరి కుర్చీ కూడా కాళీగా బోసిగా మిగిలివుంది.

చివరికి ఈ బ్రతుకులూ ఇంతేనా ?

ఈ కాళీ — ఈ లోటు తీరేదికాదా ?

హఠాత్తుగా ఆమెకి భర్త గుర్తుకి వచ్చాడు. గుండెల్లో భయంకరమయిన అలలు లేచేయి. సంక్షుభితమయిన తుఫాను విజృంభించింది. ఆ తుపానుని నిగ్రహించుకోవటానికి ఆమె చాలా ప్రయత్నించవలసి వచ్చింది.

ఏమిటి ఈ కాళీ ? ఈ వెలితిని ఎలాగ భరించటం ?

ఎక్కడ తన 'దేవుడు ?' ఆయన ఎందుకు రారు ?

పచ్చపచ్చగా పరివేష్టించి ముచ్చట్లాడుతున్న ఈ చిన్నారుల్ని నిండుమనసుతో దీవించవలసిన ఆ 'పురుషోత్తముడు' ఏడి ?

ఆ తలపు మనసుని కలవరపరచగా — అన్నపూర్ణమ్మ వలవలా ఏడిచింది.

'అమ్మా! ఏమయింది?' అంటూ ఆత్రుతతో, కంగారుగా దరిచేరిన పెద్దాడు రామారావు వడిలో మొహం దాచుకుని పసిపిల్లలాగ ఏడిచింది ఆమె.

'అమ్మా అమ్మా' అంటూ కళవళ పడ్డారు ఆమె పిల్లలు.

కాసేపటికి అన్నపూర్ణమ్మ తెప్పరిల్లింది. విషాదాన్నుంచి బయటపడింది. కొడుకులు చన్నీళ్ళతో ఆమె మొహం కడిగారు. కూతుళ్ళు తువ్వాలుతో తుడిచారు. కోడళ్ళు పరిచర్యలు చేసారు.

'అమ్మా, ఎందుకే? అలా ఏడ్వావేంటి?' అని అడిగాడు రామారావు.

'మన పద్మ వెళ్ళిపోయిందిగదా. అందుకు దుఃఖాన్ని ఆపుకోలేకపోయానురా' అంది అన్నపూర్ణమ్మ. అసలు సంగతి చెప్పటానికి ఆమె సిగ్గుపడింది. 'ఇందులో తప్పేదేముందమ్మా! ఆడపిల్ల అత్తారింటికి వెళ్ళాలి. మగబిడ్డ అయితే ఏ ఉద్యోగమో వెతుక్కుంటూ వెళ్ళాలి. ఇది విధాయకమే గదా' అంటూ సర్దిచెప్పబోయిన రామారావు, తన కూతురు పద్మ వెళ్ళిపోయిందన్న ఆ తలపు తెచ్చిన విషాదాన్ని అణచుకోవాలని ప్రయత్నించాడు. అతని మొహం మ్లానంగా అయింది. అతని భార్య లేచి లోపలికి వెళ్ళింది — దుఃఖాన్ని ఆపుకోలేక.

ఆసరికి పందిరి కాళీ అయింది.

పనివాళ్ళు వచ్చి కాళీ కుర్చీల్ని మడిచి, లెక్కపెట్టుకుని లారీలో వేసుకుపోయారు.

అన్నపూర్ణమ్మ మనసుని ఆవరించిన విషాదం అప్పటికి పూర్తిగా తొలగిపోయింది. నలుగురితోపాటు తనూ ముచ్చట్లలో పడింది — అవుకిక జీవన వ్యాపారంలో ఆమె మనసు లగ్నమయింది.



## టెన్నిసు వీరులు

పశ్చిమ జర్మనీకి చెందిన టేబుల్ టెన్నిసు ఆట గాళ్లిద్దరు విరామం లేకుండా 105 గంటలు ఏకబిగిన టెన్నీసులాడి అప్పటి వరకూ ఉన్న పాతరికార్డును బద్దలుచేసి, సరికొత్త రికార్డు స్థాపించారట. పాత రికార్డు 103 గంటలట.

## వింతప్రయోగం !

పశ్చిమ జర్మనీలోని వో విద్యాలయానికి చెందిన విద్యార్థులు ఒక టెలిఫోను బూతులో ఎంత మంది పట్టొచ్చారు అనే విషయం మీద ప్రయోగం చేసి పద హారుమంది ఒకరి మీద ఒకరుగా కూర్చోపెట్టి — పట్టొచ్చారని తేల్చారట. అందుకనే కృత్వాపి గార్దభ రోదనమే, ఏనకీనోపాయేన ప్రసిద్ధ: పురుషోభవేత్ ! అన్నారు. గాడిదలా అరిచైనాసరె, ఏదో ఒకటి చేసి ప్రసిద్ధుడవ్వాలన్నది పూర్వకాలేకాదు కదా ! పెద్దల మాటలు.

## దా రు ణ హ త్య

కర్నూలు జిల్లాకు చెందిన నిట్టూరుఅనే గ్రామంలో చంద్రశేఖరరెడ్డి అనే ఆయన భార్యా పిల్లలతో పూళ్ళో పర్యటించూసి, తిరిగి వస్తుండగా ఎవరో ఆయన మీద నాటుబాంబు విసిరారట. ఆయన క్రిందపడ గానే ఏడుగురు ఆయన మీద విజృంభించి కత్తు లతో కసకస పొడిచి చంపేశారట. చంద్రశేఖరరెడ్డి ఇందిరా కాంగ్రెసుకుచెందిన ప్రముఖుడట.

### అతని కంటె ఆలి ఘనత !

ఢిల్లీ మెయిన్ రైల్వేస్టేషను ప్రొటక్షన్ ఫోర్స్ పోలీసుకు చెందిన కిషన్‌సింగ్ అనే అతన్ని అజ్మీరు ట్రాన్స్‌ఫర్ చేస్తే ఆతను నిరాహారదీక్ష వంటిది చేపట్టి ఆ ఆర్డర్స్ ఆపుచేయించుకున్నాడట. కానీ ఆతనిభార్య మరింత గలాటాచేసి అతన్ని తన పుట్టింటివూరు హిస్సార్‌కు బదిలీ చేయించిందట. బాబోయ్ ! అత్తా రూరుకన్నా అజ్మీరే మేలనాతడు అన్నమన్నా ప్రయో జనం లేక పోయిందట. మూకుడులో నేడి భరించలేక నిప్పులోకి దూకినట్టయ్యిందా సింగుగారి పని ! ఎం తైనా ఆడవారు ఆడవారే ! వారి గొప్పవారిదే ! జీహో!!

### జరగగూడనిది జరిగితే

ధర్మపురి నుంచి అరూర్ అనే వూరుకు చెరుకు లోడుకు వస్తున్న లారీ సద్ఏక్సిలు టప్పున విరిగి పోవడంవల్ల లారీగతితప్పి, పామునిమెలికలు తిరిగి, రోడ్డుదిగి పల్లంలోకి దొర్లిపోయి, ఇద్దర్ని చంపి, స్థిరపడ్డదట. అంతేగాక, మరో అరడజను మందిని రకరకాలుగా అనేక స్థితులలోగాయపరచిం దట.

### ఒంటెకు కోపంవస్తే ....

జంతువులలో ఒంటె చాలా కోపిష్టిదట. సాధా రణంగా కోపంరాని యీ ఒంటెకు కోపం వస్తే మను ష్యులనయినా కరకర అప్పడాలు నమిలినట్లు నమిలే స్తుందట. అంతేగాక దాను పగపట్టితే ఆ వ్యక్తిగానీ, మృగంగానీ ఎక్కడున్నా పట్టుకుని, తనపగనుతీర్చు కుంటుందట.



### ఆవుని పాతి పెట్టబోతే.... !

జమ్ముకు చెందిన కఠకవ్ అనే గ్రామంలో సూరు అనే ఒకతనికి ఒకే ఒక్క ఆవుందట. ఆ ఆవు పాలు అమ్మి తన సంసారాన్ని పోషించుకునే వాడట. మొన్న 20వ తేదీన ఆ ఆవు చనిపోవడంతో అతను కుదేలై బోరున ఏడ్చి ఆ ఆవును పాతైడానికి కూడా డబ్బులేక చందాలతో ఆ పని ప్రారంభించాడట. తన సొంతం అనుకునే పొలంలో గొయ్యి త్రవ్వుతూం డగా ఖంగున శబ్దమై వో దాగిబింది బయట పడ్డ దట. దాంట్లో 700 వెండి నాణాలున్నాయట.

### కంచెమేసిన చేను

గ్వాలియర్‌లో పబ్లిక్ హెల్త్ శాఖలోని వో ఇంజ నీరుగారు లంచం తింటున్నారన్న విషయం మీద ఆరాలు తీయడానికి పోలీసు శాఖ క్రిమినల్ ఇన్వెస్టి గేషను డిపార్టుమెంటుకు సంబంధించిన వో ఇనస్పె క్టరుగారిని పంపితే, ఆ మహనీయుడు ఆ ఇంజనీరు గారివద్ద వెయ్యి రూపాయలు లంచం అడిగి, అదిస్తే తాను అతని మీద మంచి రిపోర్టు రాసిపారేస్తానని హామీ యిచ్చాడట. ఆ డబ్బు రెండిన్‌స్టాల్‌మెంటుల్లో యిస్తానని ఒప్పందం చేసుకున్న ఇంజనీరు గారు మొదటి ఇన్‌స్టాలుమెంటు యిచ్చే శుభ ముహూర్తాన్ని విజిలెన్సుశాఖకు తెలియజేసేసరికి వారు సపరివారంగా వచ్చి ఇనస్పెక్టరుగారిని ఆ సుముహూర్తం అయ్యాక అరెస్టు చేశారట.

### పి తృ హ త్య

కుందాండియూరులో 50 ఏళ్ల మణి అనేఆయన తన భార్య పాప అనేఆమెను వదలిపెట్టి ఎవతినో వుంచు కున్నాడట. ఈ విషయం తెలిసిన అతని కొడుకు షేఫ్ పొరుగూర్నుంచి వచ్చిన తల్లితోయీ విషయం మాట్లాడుతున్నాడట. ఈలోగా అక్కడికి వచ్చిన తండ్రిని చూసి, ఆవేశపడి, చేతికి అందుబాటులో వున్న దుడ్డుకర్రతో ఆతన్ని శక్తివంచనలేని దెబ్బ కొట్టాడట. అంతే ! ఆ దెబ్బకే ఆయన ప్రాణాలు పోయాయట !

### ఎలుకల బెడద !

మన దేశంలోని పంటలో ఎక్కువ శాతం ఎలుకలు నాశనం చేస్తున్నాయట. వీటి మూలంగా ఏటికి ఒక కోటి టన్నుల ఆహార ధాన్యాలు నాశన మవుతున్నాయట. ఇది ఏటికి రెండున్నర కోట్లకు కూడా మించిన నిదర్శనాలున్నాయట. ఈ ఎలుకలను పట్టి, వాటి జాతిని నాశనం చేయడానికి మన దేశం కోరికపై సోవియట్ యూనియన్ నుంచీ, జర్మనీ నుంచి ఆ శాఖ నిపుణులు వచ్చారుట. వారు అనేక ప్రాంతాలు తిరిగి, అనేక పరీక్షలు జరుపుతున్నారట. పదకొండు జాతుల ఎలుకలు సుమారు ఆరు వందల యాభై కోట్లకు పైగా దేశంలో ఉన్నాయట. ఒక ఆడఎలుక ఏటికి పన్నెండుసార్లయినా గర్భం ధరించి సంతానాన్ని కనగలదనీ, ప్రతీ కాన్పుకూ డజను పిల్లలయినా పుట్టొచ్చనీ నిపుణులంటున్నారట. దేశంలోని ఎలుకలు అతి తెలివైనవట. కొత్తగా వాసన వేసే పదార్థాలనవి ముట్టనే ముట్టవట. మన దేశం వచ్చిన రెండు విదేశ నిపుణులూ తలో రకం విషాలనూ పొలంలోని ఎలుకల కన్నాలలో చల్లిస్తున్నారట. చూదాం.



సీరియల్

# దిగిరాని స్వర్గాలు

ఆకెళ్ల వెంకట సూర్యనారాయణ * కెవిస్వీ

పెళ్ళికొడుకు వసంతరావు, వెంకట్రామయ్య – భార్య వచ్చేరు. రాధను పక్కింటామె తీసికొచ్చి కూర్చోపెట్టింది. రాధ సింపుల్‌గా డ్రస్ వేసికొంది. మెను రెపవాల్చకుండా చూశాడతను. రాధ ఓరగా చూసి తల దించుకొంది.

"మీ పేరూ..."

"రాధ"

"నా పేరు వసంతరావు. మీరెటూ అడగటానికి సిగ్గుపడతారని నేనే చెప్తున్నాను."

రామయ్య నవ్వి "భలేవారే" అన్నాడు.

"ఏం చదువుతున్నారుగా ?"

"బి యస్ సి ఫైనల్"

"పరీక్షలు..."

"సెప్టెంబర్"

"ఐ. సి. బ్యాంకులో క్యాషియర్ నిబి కావ్. సరే మీరూ – అన్నదమ్ములు— అప్పచెల్లెళ్లు ఎందరూ ?" అతనే అడిగేడు.

"ఒక అన్న, అక్క వున్నారు. ఇద్దరికి పెళ్ళిళ్ళు అయ్యేయి."

"వెరీగుడ్... నేనూ... నా తల్లి అంతే. మీరు పెళ్ళి అయితే ఉద్యోగం చేస్తారా?"

"అదీ..."

"ఫరవాలేదు చెప్పండి" అన్నాడతను.

"కాబోయే భర్తమీద ఆధారపడి వుంటుంది."

"అంటే మీ భర్త చేయమంటే చేస్తారన్నమాట"

రాధ తల వూపింది.

"వెరీ గుడ్"

అప్పుడే లోపల కొచ్చింది గీత. రాధా... సావిట్లో మనుషులు ఉండటంచూసి ఆగిపోయింది.

"రామ్మా గీతా..." ఆహ్వానించేడు రామయ్య.

"ఈ అమ్మాయి..."

*(గత సంచిక తరువాయి)*

"మా రాధ స్నేహితురాలు, గీత."

"నమస్కారం... నా పేరు వసంతరావు" చేతులు జోడించేడు వసంతరావు.

"నమస్కారం" అంది గీత అతని మర్యాదకు విస్తుపోతూ.

"మీరూ... బి యస్.సి"

"అవును"

"వెరీగుడ్. రామయ్యగారు నేనడగవలసింది మరేంలేదు. కట్నం గురించి పట్టింపులూ నాకు లేవు రాధగారికి నేను నచ్చితే ముహూర్తాలు పెట్టుకోవడమే. అయితే నేను చెప్పినట్టు పెళ్ళి త్వరగా జరిగిపోవాలి" అన్నాడు వసంతరావు లేచి నిలబడి.

రామయ్య లేచేడు.

"వస్తానండి. వస్తాను గీతగారు..." అతను బయటకు నడిచేడు. వెంకట్రామయ్య భార్య చేతిలో పూలపొట్లం జాకెట్టుగుడ్డ రాధ చేతిలో వుంచి బయటకు నడిచింది.

అందరూ బయటకు నడిచేరు. రాధ, గీత వున్నారు.

"ఏయ్ నాతో చెప్పకుండా పెళ్ళి చేసికొంటావా ?" అంది గీత.

"అబ్బే. అదేంలేదే."

*జరిగినకథ 2* రాధ, కుసుమ, గీత, ప్రాణస్నేహితులు. రాధతండ్రి రామయ్య కూతురు పెండ్లి చేయలేని స్థితిలో వుంటాడు. కుసుమ సంపన్నురాలయినా తాను ఒక మనసున్న, సామాన్యమైన మనిషిని చేసుకుంటాననంటుంది. గీత ఒక ఉన్నతాధికారిని చేసుకోవాలనుకుంటుంది. సహాయం చేసే స్థితిలోవున్నా, చేయలేనని ఉత్తరం వ్రాస్తాడు రాధ అన్న రామం. బలవంతం చేయబోయిన గీత అన్న బాబ్జి బారి నుండి బయట పడుతుంది రాధ.

"లేదా ? పెళ్ళిచూపుల విషయం నాతో చెప్పేవా ?"

"ఎన్ని పెళ్ళిచూపులు కాలేదు. ఇందులో కొత్త ఏముందీ"

"ఎన్ని పెళ్ళిచూపులయినా – అందరి పెళ్ళికొడుకుల్లాగ లేడే ఈయన... మనిషే కాదు, మనసు అందంగా వుంది. అతని మర్యాదా, మన్ననా క్షణంలో తెల్సిపోయింది. యు. ఆర్. లక్కీ... పార్టీ ఇవ్వాల్సిందే."

"చూద్దాం."

"అలా అంటే కాదు. ఆర్ యు నాట్ హేపీ.."

"నేను జీవితంలో ఏదైనా ఆనందంగానే స్వీకరిస్తానే"

"సో... అమ్మాయిగారు త్వరలో పెళ్ళికూతురు. ఈ విషయం కుసుమకు చెప్పాలి."

"ఉండవా ! కాఫీ తాగి వెళ్ళువుగాని"

"స్వీటు లేందే కాఫీ పుచ్చుకోను"

"అయితే ఇదిగో స్వీటు" పెళ్ళివారి కోసం తెచ్చిన స్వీట్సులో ఒకటి గీత నోట్లో కూరింది రాధ.

"నేను వెళ్తున్నానే" అంటూ గీత ముద్దుగా మాట్లాడుతూ వెళ్ళిపోయింది. వెళ్ళబోతూ వెనక్కితిరిగి "వచ్చిన పని మర్చిపోయాను. నీ జువాలజి రికార్డు ఇయ్య" అంది.

రాధ బీరువాలోంచి రికార్డు తీసిచ్చింది.

గీత బస్సుస్టాండులో నిలబడి– రాధకు కాబోయే భర్త మంచివాడులా వున్నాడు. అలాంటి వాడికి మరికాస్త ఆస్తి వుంటే మరీ బాగుంటుంది. అనుకుంటూ ఆలోచిస్తోంది.

"హలో మిస్" పిలుపు వినిపించింది.

టక్కున అటు చూసింది.

అతనే. ఔను, అతనే కారుదిగి వస్తున్నాడు. ఈ రోజు బ్లూ కలర్ కారు. బ్లూ కలర్ సూటు. క్షణకాలం అతన్ని చూసి తలదించుకొంది.

"నన్ను తిట్టుకొంటున్నారా గీతగారు."

ఉలిక్కిపడిన గీత తలఎత్తి "నాపేరు... మీకూ..."

"మీ కాలేజి దగ్గర మీ స్నేహితురాలు పిలుస్తుంటే విన్నాను."

"అంటే, నేనెక్కడికెళ్ళినా వెంటాడుతున్నారా?"

"అవును. నో—ఇంటిముంచి స్టార్ట్

అయి ఈ పక్క వీధిలో మూడో యింటికెళ్ళి పచేరు. ఇట్ ఇట్ వాట్.''

'అంటే నా ఇల్లు నా పొజిషనూ... అన్ని తెలుసన్న మాట''

''యస్''

''తెలిసి ఇంకా నావెంట ఎందుకు పడుతున్నారూ?''

''అంతే''

''మీలా నేను లక్షాధికారి కూతుర్నేం కానూ.''

''తెలుసు. మీరెక్కే కారు మీ ఫ్రెండ్ కుసుమదని... సో వాట్.''

''తెలిసి నా వెనుక...''

''కట్ దట్...డబ్బుకోసం నీ వెంట పడవక్కర్లేదు. నా పేరు ప్రతాప్... ఈ ఊరిసగం కొనగలడు మా డాడీ...''

''అయితే మరి''

''మీకోసం.. మిమ్మల్ని సడన్‌గా బజారులో చూశాను. నేనెంతో మంది అమ్మాయిలని చూశాను కాని...ఎవరికేసి రెండోసారి చూడబుద్ధి కాలేదు. యుఆర్ ఫెంటాస్టిక్'' అతను చెప్పే ప్రతిమాట సంగీతంలా విన్పిస్తోంది గీత చెవులకు.

సడన్‌గా తాము రోడ్డుమీద నిలబడి మాట్లాడుతున్నామనే విషయం ఆమెకు స్మరణకొచ్చింది.

''ఇది రోడ్డు. దయచేసి మీరు వెళ్ళండి. నిజంగా నామీద మీకు అభిమానముంటే నడిరోడ్డులో నా పరువు తీయకండి...ప్లీజ్ వెళ్ళండి'' అంది.

''పోనీ. కమ్ ఇన్ టు మై కార్...ఎక్కడికో వెళ్ళి, మాట్లాడుకోవచ్చు.''

''నో సారీ...''

''పోనీ...సాయంత్రం—పార్కుకి రాకూడదూ?''

''ఈ వాళా?...''

''అవును''

''చూస్తాను. నా బస్సు వస్తోంది. వెళ్ళాలి'' అంటూ బస్సుకేసి పరుగెత్తింది గీత.

''సాయంత్రం ఆరు గంటలు'' వెనక నుంచి అంటున్నాడతను.

## 6

కాలేజినుంచి ఇంటికొచ్చిన కుసుమ హాలులో సోఫాలో రాజేంద్రతోపాటు మరో వ్యక్తి కూర్చుని వుండటం చూసి అన్నను పలకరించబోయి ఆగిపోయింది.

''కుసుమా, ఇలా రా...'' రాజేంద్ర పిలిచేడు కుసుమ అన్నకేసి నడిచింది.

''నా సిస్టర్. బి యస్ సి ఫైనల్ చదువుతోంది ఇతను నా ఫ్రెండు. విశాఖలో మేమిద్దరం చదువుకొన్నాము. ఈ ఊళ్ళో మీ కాలేజీలో లెక్చరర్‌గా ఉద్యోగం వచ్చింది'' పరిచయాలు చేశాడు రాజేంద్ర

''ఐ జస్ట్...అదే కాబోలు కోటనీకి కొత్త లెక్చరర్ వస్తారన్నారు. మీరేనా?... నమస్తే సార్''

''నమస్తే'' అన్నాడతను.

''మీ లెక్చరర్ అవగానే కాకా పట్టేస్తున్నావే''

''నో. అన్నయ్యా ... సార్, రేపు మీరు జాయిన్ అవుతారా సార్ ... రేపు సెకండ్ అవర్ మీ క్లాసే''

''నా టైమ్ టేబిల్ మీరే ఇచ్చేస్తున్నారే' నవ్వేడు రామారావు.

రాజేంద్ర నవ్వేడు.

భారతి కాఫీలు తెచ్చింది.

''నా వైఫ్ ... భారతి ... ఇతను నా ఫ్రెండు రామారావు'' భారతిని పరిచయం చేశాడు రాజేంద్ర.



"సారీ.. రాజేంద్ర! నీ పెళ్ళి శుభలేఖ అందింది రాలేకపోయాను"

"బహుశా... ఏ పనో తగిలి వుంటుంది"

"ఏమి లేకే రాలేకపోయాను"

"అంటే"

"ఏముంది. ఉద్యోగం అంటూ వుంటే జీతం ఉంటుంది- అదుంటే పెళ్ళికే వచ్చే వాణ్ణి. డబ్బు లేక రాలేకపోయాను..."

అతను చెప్పిన నిజానికి కుసుమ, రాజేంద్ర, భారతి ఆశ్చర్యపోయారు.

రామారావు కాఫీ తాగి కప్పు క్రింద పెట్టి లేచి "నేను వెళతాను" అన్నాడు.

"ఎక్కడికీ..."

"హోటల్‌కి"

"నేనివూళ్ళో వుంటే నువ్వు హోటల్లో దిగుతావా ?"

"నేనివూరు చూడటానికి రాలేదు. ఉండటాని కొచ్చేను. చూడటానికొస్తే మీ ఇంట్లోనే దిగేవాణ్ని."

"అదేం కుదరదు. నువ్వు సెటిల్ అయ్యేదాక మా ఇంట్లో ఉండక తప్పదు. పద ఏ హోటల్లో దిగేవు" లేచాడు రాజేంద్ర.

* * *

కుసుమ కాలేజి కెళ్ళబోతుంటే—

"టిఫెను చేసి వెళ్ళవే" అంది మాణిక్యాంబ.

"వద్దు"

"మీ ఇష్టాలు. చేసిన టిఫెన్ అంతా వేస్టు. అన్నయ్య స్నేహితుడు చేయలేదు. అన్నయ్య ఉదయమే కంపెనీకి వెళ్ళిపోయాడు. అతను మొహమాటం పడుతున్నాడో ... ఏంటో..." అందామె.

"ఎవరూ...రామారావుగారా...నేను కనుక్కొంటాను" అంటూ కుసుమ రామారావు కిచ్చిన గదిలోకి నడచింది. రామారావు కాలేజీకి వెళ్ళటానికి బట్టలు వేసుకొని తల దువ్వుకుంటున్నాడు.

"సార్, టిఫెన్ చేయలేదుటా...రండి."

"నన్ను మీరు సార్ అనిపిలవటం బాగోలేదు కుసుమగారు."

"మీరు నాకు లెక్చరర్"

"కావచ్చు. అయినా మీరు అలా పిలవటం ఇబ్బందిగా ఉంది కుసుమగారు."

"మీరు కుసుమగారు అని పిలిస్తే నాకూ ఇబ్బందిగానే ఉంది" నవ్విందామె.

## దిగిరాని స్వర్గాలు

అతను మాట్లాడలేదు.

"రండి టిఫెన్ చేద్దురుగాని."

"నాకు ఉదయం టిఫెన్ అలవాటు లేదు."

"ఒక్కరోజు తింటే కొంప మునగదు. పైగా ఈ నాటి మీ మొదటిక్లాసు. మిమ్మల్ని ఆటపట్టిస్తారు ముఖ్యంగా మా గర్ల్స్. అవన్నీ తట్టుకోవాలంటే మీరు పూర్తి శక్తి కలిగి వుండాలి."

"దానికి కావలసింది ... ఈ శక్తి కాదు. బుర్రలో శక్తి."

"కావచ్చు. ఇదీ ముఖ్యమే..."

"పదండి"

"సరే, మా డాడీ మీకోసం వెయిట్ చేస్తున్నారు. మీరు తినరంటే ఆయన వూరుకోరు..."

"ఆయన నాకోసం వెయిట్ చేస్తున్నారా ?... అయితే పదండి బాగుండదు" రామారావు డైనింగ్ హాల్ కేసి నడిచాడు.

"మంగమ్మా! టిఫెన్ వడ్డించు" అంది కుసుమ.

ఇద్దరూ కూర్చున్నారు.

"మీ...డాడీ..."

"వస్తారు."

మంగమ్మ పెసరట్లు — ఉప్మా రెండు ప్లేట్లు తీసికొచ్చి ఇద్దరి ముందు పెట్టింది.

మాణిక్యాంబ నెయ్యి వేసి 'తినవాయనా' అంది.

"ఆయన్ని రానీయండి"

"ఎవర్ని"

"కుసుమా వాళ్ళ డాడీని"

"ఆయనెప్పుడో బయటకెళ్ళిపోయారు. నువ్వుతిను" అందామె.

అతను ఆశ్చర్యంగా కుసుమ కేసి చూశాడు. ఆమె నవ్వింది.

ఇద్దరూ టిఫెన్ తిని కాఫీ తాగేరు.

"రండి...కారు రడీ..." అందామె.

"ఎక్కడికి"

"కాలేజీకి"

"నేను నడిచి వెళతాను"

"వీల్లేదు."

బెదిరిపోయినట్టు చూశాడు రామారావు.

"సారీ... కాలేజీకి కారులో నే నెటూ వెళ్తున్నాగా... మీరూ రండి."

"వెళ్ళు నాయనా" అంది మాణిక్యాంబ.

అతను తలవూపి నడవబోయాడు కారు వద్దకు

"ఆగండి" అంది కుసుమ.

టక్కున ఆగిపోయాడు.

"ఈవాళ మొదటిరోజు ఉద్యోగంలో జాయన్ కాబోతున్నారు. మంచి శకునంతో వెళ్ళాలి. మా మమ్మీ శకునం మంచిది. మమ్మీ శకునం రా..." అందామె.

అతను ఆశ్చర్యంగాను ఆరాధనగాను ఆమెకేసి చూశాడు "అవును మర్చేపోయాను" అంటూ మాణిక్యాంబకేసి చూసి "నా తల్లి ఎప్పుడో చిన్నప్పుడు పోయింది. మీరు నా తల్లిలాంటివారు ఆశీర్వదించండమ్మా" అ న్నడతను మాణిక్యాంబ పాదాలకు నమస్కరించి.

"లే నాయనా..." అందామె మనసులో దీవించి అతను లేచి నిలబడ్డాడు.

ఆమె గుమ్మంవరకు వెళ్ళి ఎగులొచ్చింది.

కుసుమా, నాగారావు పోర్టికోలోకొచ్చేరు.

మస్తాన్ డోరు తెరవబోయి కుసుమ తీక్షణంగా చూడటంతో ఆగిపోయాడు.

ఆమె బ్యాక్ డోర్ తెరిచి..."ఎక్కండి" అంది.

"నేను ఫ్రంట్ సీట్లో కూర్చుంటాను" అంటూ ఆమె సమాధానంకోసం ఎదురు చూడకుండా అతను కారెక్కి కూర్చున్నాడు.

ఆమెనవ్వి బ్యాక్ సీటులో కూర్చుంది.

"మీా కభ్యంతరంలేకుంటే దారిలో నా ఫ్రెండ్ గీతను పికప్ చేసికొని వెళదాం."

"ఇది మీా కారు. నా కభ్యంతరం ఏమిటి?"

మీారు "లంచ్ అవర్‌లో ఇంటికెళ్ళకండి నాతోపాటు మీకు క్యారేజీ వస్తుంది. ఇద్దరం కాలేజీలోనే తినచ్చు."

'మీతోనా'

"ఏం భయమా!?"

"అదేం కాదులెండి"

"మీ మొహమాటం నా కర్థమయింది... సరే...మస్తాన్ అయనకు క్యారేజి పట్టుకొని రా...ఆయన లెక్చరర్స్ రూములో వుంటారు...ఇచ్చేయి" అందామె.

మస్తాన్ తల వూపాడు.

కారు గీత యింటిముందు ఆగింది.

"అదే... నా ఫ్రెండు ... పరిచయం చేస్తాను" అంది కారుకేసి వస్తున్న గీతను చూపి కుసుమ.

## 7

సినిమా హాలుదగ్గర జనం చాలావున్నారు.

"ఏమే...సినిమాప్రోగ్రాం వేసినదానివి... టిక్కెట్లు రిజర్వు చేయించద్దూ" అంది కుసుమ విసుగ్గా గీతని.

"పోని...ఇంకో సినిమా కెళదాం" అంది రాధ.

"మన రాధ మరో కొద్ది రోజుల్లో వసంతరావుగారి భార్య కాబోతోంది గనక 'భార్య-భర్తలు' సినిమా కెళ్ళాలి..." అంది గీత.

ముగ్గురూ నవ్వేరు.

"పాత సినిమాకు ఇంత జనమా. పోని యింటికిపోయి కబుర్లు చెప్పుకుందాం" అంది కుసుమ.

"ఉండు చూస్తాను – అసలు ఎంత సేపయిందో టిక్కెట్లు ఇవ్వటం మొదలెట్టి" అంది గీత క్యూకేసి నడుస్తూ.

రాధ-కుసుమ నిలబడ్డారు

గీత 'క్యూ' దగ్గరకెళ్ళి "ఎంతసేపయిందీ టిక్కెట్లు ఇవ్వటం మొదలెట్టి" అడిగింది.

"చాలా సేపు అయింది" అన్నారెవరో.

ఆమె తిరిగి వస్తుంటే కనబడ్డాడు ప్రతాప్.

"హలో గీతా"

సినిమాలో కృష్ణుడిలా ఎక్కడబడితే అక్కడ ప్రత్యక్షం, అనుకొని గీత "ఏం" అంది.

"పార్కు కొస్తానని రాలేదు."

"సారీ...నా ఫ్రెండ్సు మరో యిద్దరితో వచ్చేను. నన్ను పలకరించకండి" అందామె.

"సినిమా కొచ్చేరా ?"

"అవును. టిక్కెట్లు దొరకలేదు."అంది గీత నడుస్తూ.

అతను ఆగిపోయాడు.

గీత, రాధ- కుసుమ వున్నచోట కొచ్చి "టిక్కెట్లు చాలా సేపటి నుంచి ఇస్తున్నారట" అంది.

"అయితే ఏంచేద్దాం..."

"పోనీ ట్రై చేస్తే"

"ఎందుకూ వేస్టు" అంది రాధ.

"సరే పదండి .." ముగ్గురూ నడవబోయేరు.

"గీత గారెవరండీ" పన్నెండేళ కుర్రాడు వాళ్ళదగ్గరకొచ్చి, అడిగేడు.

గీత ఆశ్చర్యంగా వెనక్కితిరిగి "నేనే" అంది.

"ఈ టిక్కెట్లు మీ కివ్వమన్నారు" అన్నాడా కుర్రాడు, మూడు టిక్కెట్లు గీత చేతిలో పెడుతూ.

"ఎవరు ?" అంది కుసుమ.

"అదిగో... ఆయనా..." అన్నాడా కుర్రాడు వెనక్కిచూపి.



ముగ్గురూ అటు చూశారు. అక్క డెవరూ లేరు.

గీత గ్రహించింది, అది ప్రతాప్ పంపేడని. ఏంచెప్పాలా అని ఆలోచిస్తోంది.

"అక్కడెవరూ లేరు" ఆశ్చర్యంగా అంది రాధ.

గీత గొంతు సవరించుకొని "పాతికేళ్ళ వాడు కదూ" అడిగింది.

కుర్రాడు అయోమయంగా తల వూపేడు.

"మా బాబ్జీ అన్నయ్యలే... నద్యాప్సాం అన్నాను, భార్యా-భర్తలు సినిమా కెలుతున్నాం... తనే ఈ కుర్రాడికిచ్చి పంపేడేమో"

"తనే వచ్చి ఇవ్వొచ్చుగా..." అంది కుసుమ.

"పనుండి వెళ్ళిపోయేడేమో"

"సరే. పదండి" అంది కుసుమ.

"గీతా, మీ అన్నయ్య వస్తున్నాడా" అడిగింది రాధ. బాబ్జీ పరుతూర్ని జ్ఞాపకం తెచ్చుకుంటూ.

"లేదు" అంది గీత నడుస్తూ.

మిగిలిన వాళ్ళు అనుసరించేరు.

ముగ్గురూ సీటు నెంబరు ప్రకారం కూర్చున్నారు. గీత పక్కసీటు ఖాళీగ వుంది. మిగిలిన హాలంతా నిండిపోయింది.

'ఈ సీట్లో ప్రతాప్ కూర్చుంటాడా?' అనుకొంది గీత. అమె అనుకొన్నట్టుగానే స్లైడ్స్ చూపిస్తుండగా వచ్చేడు ప్రతాప్.

"ఎక్స్‌క్యూజ్ మీ మేడమ్స్" అన్నాడు.

కాళ్ళు చాపుకొని కూర్చున్న ముగ్గురూ కాళ్ళు వెనక్కి తీశారు. అతను వాళ్ళని దాటుకొని వెళ్ళి గీత పక్కన కూర్చున్నాడు.

గీత ఉలిక్కిపడింది.

అతను ఒళ్ళో చేతులు పెట్టుకొని బుద్ధిమంతుడిలా కూర్చున్నాడు. రాధ – కుసుమ తలతిప్పి అతనికేసి చూసి, మళ్ళా సినిమా చూడటం మొదలెట్టారు.

ప్రతాప్ ఒంటినించి వచ్చే మంచిగంధం వాసన గీత ముక్కు పుటాలను అదరకొడుతోంది. అతనే క్షణాన ఏం అల్లరి పని చేస్తాడో అని భయపడిన గీత, అతను బుద్ధిగా సినిమా చూడటంలో వుండటం చూసి ఆశ్చర్యపోయింది. అతను ఇంటర్‌వెల్ ముందు గీత చేతిలో ఓ కాగితం వుంచి చేయి వెనక్కి తీసుకొన్నాడు.

గీత ఉలిక్కిపడింది. చుట్టూ చూసింది.

# దిగిరాని స్వర్గాలు

స్నేహితురాళ్ళు సినిమా చూస్తున్నారు. ప్రతాప్‌కేసి చూసింది.

"ఇప్పుడే సమాధానం కావాలి" అన్నాడతను మెల్లిగా.

గీత కంగారుగా కాగితాన్ని జాకెట్టులో దోపుకొంది. అతను నవ్వేడు. లైట్లు వెలిగేయి. అతను లేచి బయటకు వెళ్ళిపోయాడు.

"ఏమే .. నీ పక్కన కూర్చున్నాడు – బుద్ధిమంతుడిలా వున్నాడే!" అంది కుసుమ.

గీత కంగారుగా "ఏం?" అంది.

## ప్రసూతి శలవు 6 మాసాలు

పశ్చిమ జర్మనీలో ఉద్యోగాలు చేసే స్త్రీలు అదృష్టవంతులు. లోగడ గర్భవతిగా వున్నప్పుడు రెండు వారాలు, పురుడైన తరువాత 8 వారాలు మాత్రం ఇచ్చే శలవును ఇప్పుడు చాలా ఎక్కువగా పెంచారు. బిడ్డ కలిగిన తర్వాత 6 మాసాల దాకా కూడా ఉద్యోగిని శలవు తీసుకోవచ్చును. కవలలు పుడితే ఇంకా ఎక్కువ కాలం శలవు పెట్టుకోవచ్చును. అంతే గాక ఆ శలవు కాలంలో పూర్తి భత్యం కూడా నిక్కచ్చిన మొత్తం లభిస్తుంది!

"ఏం లేదు. నీ అంత అందమైనపిల్ల పక్కనుంటే అమాయకుడిలా కూర్చున్నాడు" అంది కుసుమ.

"చాలే ఊరుకో ...అందరూ అలాంటి వాళ్ళే వుంటారా! అయనెవరో మంచివాడు. అలా వుంటే కూడా బాధే..' అంది రాధ.

రాధ పొగిడింది ప్రతాప్‌నైనా - గీతకెంతో ఆనందంగా వుంది.

"ఉత్తరంలో ఏం రాసివుంటాడు. వెంటనే సమాధానం కావాలంటున్నాడు. ఎలా?" అనుకుంటూ గీతలేచి టాయిలెట్స్ కేసి నడిచింది. ఖాళీగావున్న టాయిలెట్‌లో దూరి తలుపు మూసింది. జాకెట్లో కాగితం తీసింది.

"డియర్ గీతా!

ఇది లౌ లెటర్ కాదు-అల్టిమేటమ్.

పార్కు కొస్తానని పిచ్చివాడిలాగ ఎదురు చూశాను. నువ్వు రాలేదు. నీ కంటికి నేనొక రోమియోలా కనపడుతున్నాను కాబోలు. నా కొచ్చిన లక్షాధికారుల సంబంధాలు విన్నా కాదన్నాను. కాని నీ అందానికి లొంగి పోయాను.

మనిద్దరం ఒకటే కులం.. అంతే నీతో మాట్లాడాలి. నామీద ఏమాత్రం ప్రేమవున్నా ఎల్లుండి సాయంత్రం ఆరు గంటలకు హోటల్ కావేరి రూమ్ నెంబరు పన్నెండుకి రా. హోటల్‌కి రమ్మంటున్నది నిన్ను చెరపడానికి కాదు. మనసు విప్పి మాటాడడానికి. బయట మాట్లాడటానికి బిడియపడుతున్నావని ఈ నిర్ణయం.

అక్కడికి రాలేకపోతే నన్ను మర్చిపో... వచ్చే ఉద్దేశముంటే ఈ ఉత్తరం నాకివ్వ–లేకుంటే చింపి పారేయి.

—నీ ప్రతాప్"

ఉత్తరం చేతోపట్టుకొని ఆలోచనలో పడింది గీత. ఏం చేయటం ... వెళ్ళాలా... మానాలా... పతిది అనుమానించి వచ్చే అవకాశం కాలదన్నుకోవటమా? వెళ్ళటమా? ఇద్దరిదీ ఒకటే కులం. నీతో మాట్లాడాలి అంటే పెళ్ళిగురించా? గీత ఆలోచనలు పూర్తికాలేదు సినిమా మొదలెట్టారు.

ఎటూ తేల్చుకోలేక గీత ఉత్తరం జాకెట్లో దోపుకొని వచ్చి సీరిగా హాల్లో కూర్చుంది. ప్రతాప్ అప్పటికే వచ్చి కూర్చుని సినిమా చూస్తున్నాడు గీతకు సినిమా అర్థం కావటం లేదు. ఏం చేయటం. ఇంత కాలానికి తను ఊహించిన లక్షాధికారే తారసపడితే అర్థంలేని అనుమానాలతో వదులుకోవడమా?

సినిమా పూర్తి కాబోతోంది.

ప్రతాప్ విసుగ్గా లేవబోయాడు. అతను విసుగెత్తి వెళ్ళిపోతున్నాడని గ్రహించిన గీత అతని కాలుతొక్కింది. అతను కూర్చున్నాడు. కాగితం తీసి అతని చేతికిచ్చింది.

అతను చేతిని గట్టిగా నొక్కి వదిలేడు.

ఆమెకు ఒళ్ళు జల్లుమంది. చేయి మెల్లిగా విడిపించుకొంది.

[ఇంకా వుంది]

## యజ్ఞుని విరహం

(13వ పేజీ తరువాయి)

చూస్తూ ఆ మనిషిని తడిమాడు. ఆ మనిషి వెంటనే కదిలి "నేను కాపలావాడ్ని; బొమ్మని కాను" అన్నాడు. మేరీ పకాపకా నవ్వింది. తరువాత హైడ్‌పార్కు చూశారు. అది విశాలమైన పార్కు. చూడ్డానికి పెద్ద ఏమీలేదు. అక్కడ పొలిటికల్ సభలు జరుగుతాయి. అక్కడ ప్రభుత్వాన్ని కాని, ఇంగ్లండు రాణిని కాని రాణీకుటుంబసభ్యుల్ని గాని బహిరంగంగా విమర్శించవచ్చు- అలా కొందరు విమర్శించడం చూశారు వాళ్ళు.

ఇంకోసారి సెయింటు ఏన్స్ పార్కుకి తీసుకెళ్ళింది. ఆ జూ అద్భుతం. చాలా విశాలమైనది. అక్కడ లేని జంతువులేదు. రాత్రి మేలుకొనే జంతువుల కోసం అండరు గ్రౌండ్‌లో సెల్సు కన్‌స్ట్రక్టు చేసి చీకటి చేశారు. మనం పగలు చూస్తాం. అవి చీకటిలో ఉండి రాత్రి అయ్యిందనుకుని మేలుకొని వివిధ ధ్వనులు చేస్తూ ఉంటాయి. ఇంకా పొడవైన జిరాఫీలు, ఖడ్గమృగం ఇవన్నీ ఉన్నాయి. అది డిసెంబరు మాసం. మంచు బాగా కురుస్తోంది.

* * *

...ఒకరోజు యమునతో బీచికి వెళ్ళాడు. అక్కడువున్న చిల్డ్రన్సు పార్కులో ఏనుగుల దగ్గర యమునకు ఫోటోలు తీశాడు. బీచిలో ఒక కెరటం వచ్చి బట్టలన్నీ తడిపేసింది. యమున చీర పూర్తిగా తడిసిపోయింది. చీర పిండుకుంటుంటే ఆమె సొగసులు తనివితీరా చూశాడు. సముద్రపు ఇసుక ఆమె పాదాలకీ కాళ్ళకీ అంటుకుంది. బంగారపు రంగు శరీరానికి వింత సొగసులు కూర్చింది ఆ ఇసుక రజను. 'ఛీ ఛీ బట్టలన్నీ పాడైపోయాయి' అంది యమున. 'లేదు నీ అందం ద్విగుణీకృతం చేసింది' అన్నాడు తను గుసగుసగా. అక్కడున్న గవ్వలు, శంఖాలు ఏరి యమున ఇంట్లో బొమ్మలు చేసింది. యమునతో మూన్నాళ్ళ సాహచర్యం మూడేళ్ళదిగా ఉంది. ఇంకో రోజు యమున ఇంట్లోకి రాకూడదంది. వాన్నెప్పు ఈ రోజుల్లో కూడా ఇంట్లోకి రాకపోవడం ఏమిటి అంటూ యమునని తను తనివితీరా హత్తుకున్నాడు. తరువాత ఇద్దరూ గంటసేపు బట్టలు మార్చుకోవ

డంలో తాపత్రయ పడ్డారు. అదొక వింత అనుభూతి ... శర్మ డైరీలో రాసింది ఓసారి చదువుకుని పడుకున్నాడు. అప్పుడే చాలా పేజీలు నింపాడు.

మేరీ, శర్మా ఆరోజు రాసెల్ స్క్వేరులోని బ్రిటిష్ మ్యూజియంకి వెళ్ళారు. ఆ మ్యూజియం చూడడానికి వింత రెండు కళ్ళూ చాలదు. ఎన్నోరకాల శిల్పాలు, ఇండియాలోని అనేక శిల్పాలు చోటు చేసుకున్నాయి అక్కడ. పుస్తక విభాగం. రకరకాల సీతాకోక చిలుకలు. కస్తూరీ, ఇంకా ఎన్నో. ఓపిగ్గా చూస్తే ఓరోజు పడుతుంది.

"మిష్టర్ శర్మా ఇక్కడ రెండు సెక్సు పిక్చర్సు రన్నవుతున్నాయి చూస్తారా" అంది. "తప్పని నే ననుకోను" అన్నాడు శర్మ. రసెల్ స్క్వేరు దగ్గరలో వున్న థియేటరులో 'ఓ కలకటా' అని లైవ్ షో నాలుగేళ్లనించే రన్నవుతోంది. ఆర్టిస్టులు మనవారు వన్నెండుమంది. నగ్నంగా సీన్సు పిక్చు చేస్తారు. పెర్ఫెక్టు షైనింగు. అందరూ స్టైలంగా చూస్తారు. అదే మనదేశమయితే జ్యోతిలక్ష్మి చిన్న డాన్సో కనపడగానే ఈలలు వేసి గోల చేస్తారు. అక్కడలా కాదు. అంత పెద్ద సెక్సు షోని నిశ్శబ్దంగా వీక్షిస్తారు. శర్మ ఆశ్చర్య పోయాడు, తరువాత 'లాస్ట్ టేంగో ఇన్ పారిస్' అనే ఫ్రెంచి చిత్రం. అందులో మార్లన్ బ్రాండో నటుడు. అందులోకూడా తెలిసిన హీరోయిన్ కొన్నిచోట్ల నగ్నంగా కనిపిస్తుంది. ఆయినావాళ్ళునగ్నంగానటించ వలసిన అవసరం నాకు కనిపించటంలేదు. మా చీర కట్టులో ఉన్న అందం ఏందులోనూ రాదన్నాడుశర్మ. మేరీ అంగీకారంగా తల వూపింది. ఇంకా రెండు వారాలుండాలి. లెక్చర్లు చివరికి వచ్చేసాయి. యమున నించి ఉత్తరం లేదు.

ఆరోజు ఆఖరి లెక్చరు. "వత్సాత్మనస్ బహూపిగణయ- ఓ ప్రియతమా! నేను అనేక విషయములను మనస్సులో తలచుకొనుచు నన్ను నేను నిలుపుకొనుచున్నాను. అందువలనట భాగ్యవతీ దిగులు పొందవద్దు. ఎవరికి శాశ్వతముగా దుఃఖము, సౌఖ్యము ఉండదు. అది రథచక్రము యొక్క కమ్మి యొక్క వరుసచేత క్రిందికిని మీదకును వెళ్ళును... వర్ష ఋతువుచేత వృద్ధి నొందింపబడిన శోభగలవాడవై నీకు



## కాలమహిమ

విశ్వామిత్రుడి కాలంనాడు
క్షత్రియుడు బ్రాహ్మణుడు కావాలను
కున్నాడు–
ఖడ్గ ధర్మం జ్ఞానదృష్టికి తలవంచింది.
ఇందిరా గాంధీ కాలంనాడు
బ్రాహ్మణుడు హరిజనుడు కావాలనుకున్నాడు
జ్ఞానమార్గం వ్యాపారదృష్టికి నమస్కా
రించింది.

– కుమార చంద్ర కులపతి



## యజ్ఞుని విరహం

ఇష్టములైన దేశముల తిరుగుము. నావలె వియోగము కలగకుండుగాక..." అని ముగించాడు శర్మ తర్వాత ప్రొఫెసరు రాబర్ట్సు మాట్లాడి 'మిస్టర్ శర్మ ఎక్స్ప్లెయిన్డ్ ది స్టోరీ ఇన్ ఎ మేగ్నిఫిసెంట్ మేనర్. లెటజ్ గివ్ హిమ్ ఎ బిగ్ ఒవేషన్" అన్నాడు. అందరూ ఆగకుండా ఐదు నిమిషాలపాటు చప్పట్లు కొట్టారు శర్మ ముకుళిత హస్తాలతో నుంచున్నాడు. తరువాత ప్రొఫెసరు రాబర్ట్సు శర్మకి స్పెషల్ ఎప్రిసియేషన్ లెటర్ ఇచ్చారు కొన్నరెన్స తరపున లండన్ బ్రిడ్జి బొమ్మ మెమెంటోగా ఇచ్చారు. ప్రొఫెసరు బ్రౌనుతో "యువర్ గెస్ట్ ఈజ్ మెర్వలెస్' అని చెప్పి వీడ్కోలు ఇచ్చారు.

ఆ రోజు శర్మ మేరీతో కలిసి ఆక్స్‌ఫర్డు స్ట్రీట్‌లోని ఎయిర్ ఇండియా ఆఫీసుకి వెళ్ళి టికెట్ బుక్ చేశాడు. మేరీ అడిగింది, మీ యమునకి ఏమీ కొనరా, అని. అక్కడున్న ఇండియన్ షాప్సులో నుంచి ఫారెన్ నైలెక్సు చీర తీసుకున్నాడు. మేరీకి రాధాకృష్ణ విగ్రహం, ప్రొఫెసర్ బ్రౌన్ దంపతులకు గిఫ్టులు కొన్నాడు. "సర్ నన్ను ఈ స్టేలో ఎంతో ఆదరించారు. నా గురించి చాలా ఖర్చుచేశారు" అన్నాడు శర్మ. "నో మై డియర్ బాయ్. నా పెటాల్. మీ ప్రొఫెసరు నీ గురించి ముందుగా లెటర్ వ్రాశారు. నిన్ను చూశాక ఆయన వ్రాసింది తక్కువే అనిపించింది" అన్నారు బ్రౌన్

ఆ రోజు ఉదయం బ్రౌన్ స్పానిష్‌లో

శర, హీ తో విమానా శయించేరుకున్నాడు. ఆనాటి ఫ్లైట్ ఎంపరర్ రాజేంద్ర చోళ్. వారి దగ్గర ఆప్యాయంగా వీడ్కోలు తీసుకున్నాడు. మేరీ శర్మని ప్రక్కకి పిలిచి, "మిస్టర్ శర్మ నేనో తప్పు చేశాను మన్నించండి. ఒక రోజు బ్రేక్ ఫాస్టు మీ రూములో పెడుతూ మీ డైరీ చూశాను. చదివాను. మీరు యమున గురించి వ్రాసిన వర్ణనలన్నీ చూశాను. ఓ కొంటె పని చేశాను. అందులోని కాగితాలు చింపి యమునకి పోస్టు చేశాను" అంది. శర్మ ముందు ఆశ్చర్యపోయాడు. తరువాత తమాయించుకుని "ఇటీజ్ ఆల్‌రైట్ టేకిట్ ఈజీ" అన్నాడు. మేరీ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆప్యాయంగా మేరీకి షేక్‌హేండు ఇచ్చాడు. శర్మ కళ్ళల్లో కూడా నీళ్ళు తిరిగాయి.

ఇండియా చేరేసరికి ఉదయం నాలుగైంది. డొమెస్టిక్ ఫ్లైట్ వెంటనే లేకపోవడం వల్ల ట్రయిను తీసుకున్నాడు. సికింద్రాబాద్ ఎక్స్‌ప్రెస్ ఆరు గంటలకి సికింద్రాబాద్ చేరింది. తరువాత కృష్ణా ఎక్స్‌ప్రెస్. యమునని ఎంత త్వరగా కలుద్దామా అని మనస్సు ఉవ్విళ్ళూరుతోంది. "హేమ పాత్రల చందన మెండిపోయె త్వరములు మా యమున్నని హారములను..." కృష్ణశాస్త్రి "పిలచిన బిగువటరా, ఎందుకే నీకింత తొందరా" రఘువంశం "శ్రోతాభిరామ ధ్వనినా రథేనా, సధర్మపత్నీ సహిత సహిష్ణుః.." చెవుల్లో మనసు చెప్పే మాటలుగా వినిపిస్తున్నాయి.

విజయవాడ నించి ఇంకో రైలు తీసుకుని రాజమండ్రి కెళ్ళాడు. అక్కడనించి మళ్ళీ బస్సు ప్రయాణం. ఈ రైళ్ళు బస్సులకి వెచ్చించే టైములో రెండుమూడు సార్లు లండన్ వెళ్ళి రావచ్చుని పించింది. బస్సు స్టాండు నించి ఒంటెద్దు బండి ప్రయాణం. మామగారు బండి పంపించారు ముందుగా కేబుల్ ఇయ్యడంవల్ల. "నువ్వెళ్ళగానే ఆ మ్మాయికి జ్వరం వచ్చింది. టైఫాయిడ్. ఇప్పుడు తగ్గిందిలే. నాల్గు రోజులైంది పథ్యం పెట్టి, మీకు రాస్తే గాబరాపడతావని తెలియజేయలేదు. జ్వరం గురించి రాయకుండా ఉత్తరం రాయాలని పించక రాయలేదు. మనేమనుకోకు" అన్నారు మామగారు. శర్మ మౌనంగా విన్నాడు. దారిలో పువ్వులు కొన్నాడు.

బండి దిగక కాళ్ళు కడుక్కున్నాడు. యమున మెరుపు తీగలా కనిపించి మాయమైంది. రాత్రి అయ్యేవరకూ గడిపాడు శర్మ. యమున రాత్రి పాల గ్లాసుతో వచ్చింది. గ్లాసు పక్కన పెట్టింది. ఒక్క ఉదుటున అందుకున్నాడు. తనివితీరా ముద్దాడాడు. మూగగా ఒకరి కౌగిటలో ఒకరు ఉండిపోయారు. యమున ఆరోగ్యం కనుక్కున్నాడు. అటువంటి రాత్రి మరి రాదన్నట్లు గడిపారు. 'విరహము కూడా సుఖమే కాదా...'

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**భారతీయ వికాస్ యోజనా సమితి :**

మత భాషా వర్గ వర్ణ బేధాలు లేకుండా రాజకీయాల జోలికి పోకుండా సంఘ సర్వతోముఖ వికాసానికి, ఆర్తజన సేవకు కంకణం కట్టుకున్న నూతన సంస్థ భారతీయ వికాస్ యోజనా సమితి, దీని ప్రధాన కార్యాలయం హైదరాబాద్ నగరం [13—ఎ, సంతోష్‌నగర్ కాలనీ 500659]. ఇది స్థాపించి సంవత్సరంనరే అయినా, మెదడు వాపు వంటి భయంకర వ్యాధుల నివారణలో కృతకృత్యం కావడాన్నిబట్టే ఈ సంస్థ సేవా నిరతి, ప్రజారంజకత్వం మనం గ్రహించవచ్చు. ఈ సంస్థ లక్ష్యాలలో కొన్ని, ఉచిత విద్య, ఉచిత వైద్య సౌకర్యం, పారిశుద్ధ్యం, వ్యాయామాలు, సాంస్కృతిక కేంద్రాలు, సాహిత్య క్షేత్రాలు, సంఘ సేవా కేంద్రాలు, సేవా సంస్థలు. ఈ సంస్థకిప్పుడు రాష్ట్రం మొత్తం మీద దాదాపు 40 శాఖలున్నవి. నగరంలో ఆరు శాఖలున్నవి. ఆర్తులకు వైద్య సౌకర్యం కల్గించడంలో ఈ సంస్థకు వైద్య విధానాల విషయంలో పక్షపాత మేమీ లేదు. కనుక ఈ సంస్థ ఆయుర్వేద, హోమియో, అల్లోపతి డిస్పెన్సరీలు నిర్వహిస్తున్నది. యోగ్యతగల డాక్టర్లు సేవాభావంతో పని చేస్తున్నారు. చింతల్‌బస్తీ, మల్కాజిగిరి ప్రాంతాలలో చెరి ఒక హోమియోపతి చికిత్సాలయం, పీల్‌ఖానాలో ఒక అల్లోపతి ఔషధాలయం, చాదర్‌ఘాట్‌లో ఒక ఆయుర్వేద ఔషధాలయం ఈ సంస్థ పక్షాన నడుస్తున్నవి. ఇలాటి చికిత్సాలయాలే నిజామాబాద్, అనంతపూర్, కర్నూలు, కరీం నగర్‌లలో పని చేస్తున్నవి. అనంతపూర్‌లోని హోమియో చికిత్సాలయం మెదడు వాపువ్యాధిని నివారించడంలో అపూర్వ సేవ చేస్తున్నది. ఈ సంస్థ ఉచిత వయోజన విద్యా కేంద్రాలను నిర్వహిస్తున్నది. నారాయన్‌పేట్‌లోని కేంద్రం ఈ విషయంలో గొప్పగా పని చేస్తున్నది. ఈ సంస్థ రెండు చోట్ల ఉచిత పఠనాలయాలను నిర్వహిస్తున్నది. ఒకచోట యువకుల శరీర పోషణానికి వ్యాయామ శాల నిర్వహిస్తున్నది. నగరంలోని ఫీల్‌ఖానాలోను, నల్గొండ జిల్లా రామన్నపేటలోను బీద, అనాథ మహిళల కోసం కుట్టుపని తరగతులు నిర్వహిస్తున్నది. ఔషధాలయాలు కుట్టుపని కేంద్రాలకు గిరాకీ చాల ఉంది. రామన్నపేట శాఖ మరొక గొప్ప పని ప్రారంభించింది. చర్మకారులకు పాద రక్షల నిర్మాణానికి తగిన ముడి సరుకు సరఫరా చేయడం తయారయిన సరుకును అమ్మించడంలో సహాయపడుతున్నది. యువకుల విజ్ఞాన వికాసానికి విచార మంథన్ అనే వేదికను ఈ సంస్థ నిర్వహిస్తున్నది. ఇది నగరంలోను, నిజామాబాద్, అనంతపురం, కర్నూలులోను దేశ హితకరమైన వివిధ విషయాలపై చర్చలు నిర్వహిస్తున్నది. ఈ సంగతులను సమితి ప్రధాన వ్యవస్థాపకుడు శ్రీ వి.ఎల్. దేశ్‌ముక్ జనవరి 1వ తేదీన ప్రెస్ క్లబ్‌లో పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో వివరించారు. మెదడు వాపు వ్యాధి నివారణకు అద్వితీయ సేవ చేసిన హోమియో డాక్టర్లు శ్రీ జి. వి. చలపతి, కె. లక్ష్మీనారాయణగార్లను గౌరవిస్తున్నామని శ్రీ దేశ్‌ముక్ వివరించారు.

ఆ గోష్ఠిలోనే డాక్టర్ జి. వి. చలపతి, డాక్టర్ కె. లక్ష్మీనారాయణ [అనంతపురం హోమియో డాక్టర్లు] మెదడు వాపు [ఎన్ సెఫాలిటిస్] వ్యాధిని గురించిన తమ అనుభవాలను వివరించారు. 1 సంవత్సరమునుంచి 12 వరకు వయస్సున్న పిల్లలకు బెల్డోన—200 రెండు మొదలు మూడు మాత్రలు వరుసగా మూడు రోజులపాటు, సంవత్సరంలోపు పిల్లలకు ఒక రోజు రెండు మాత్రలు మాత్రం చాలునని, ఇది నివారణోపాయమని, ఇక జ్వరం, తలనొప్పి, వాంతులు ఉన్నప్పుడు ప్రతి అరగంటకుగాని, ప్రతిగంటకుకాని, బెల్డోన—6 గాని, బెల్డోన—30 రెండు రెండు మాత్రలు ఇవ్వాలని వారు తెలిపారు. దీనికి ఆయుర్వేద చికిత్సేమీ లేదా అని ప్రశ్నించగా, వైద్య విద్వాన్ శ్రీ డి. బాపన్న పంతులు సమాధానం చెబుతూ, మెదడు వాపు దోమల వల్ల వస్తున్నది గనుక, వాటి విధ్వంసనానికి సాంబ్రాణి, వేపాకు, గంధకం, ఆవాలుకలిపిన ధూపం వేయాలని వివరించారు. అనంతపురంలో భారతీయ వికాస్ యోజనా సమితి శాఖ చేస్తున్న కృషిని శాఖ అధ్యక్షుడు, యువ న్యాయవాది శ్రీ ఎల్. లక్ష్మయ్య, సంయుక్త కార్యదర్శి డాక్టర్ డి. బాపన్న పంతులు వివరించారు. ముఖ్యంగా మెదడు వాపు వ్యాధి చికిత్సా నిరోధాలకు చేస్తున్న విస్తృత సేవను వివరించారు. డాక్టర్ జి. కృష్ణప్ప కూడ వివరించారు. వికాస యోజనా సమితిలక్ష్యాలు, వాటిని ఆచరణలో పెడుతున్న తీరు చూడగా జనంలో బాగా చొచ్చుకొని పోగలదని విశ్వసిస్తున్నాను. ఉచితంగా, శ్రద్ధగా సేవ చేస్తున్న వివిధ రంగాల కార్యకర్తలే నా విశ్వాసానికి సాక్షి.

**ఉపశ్రుతి :**

అభినందనలు అందుకోండి— అన్నాను ఎన్నికలలో విజయం పొందిన ఒక వీరుణ్ని. అబ్బ! చావు తప్పి కన్ను లొట్టబోయినట్టు అన్న సామెత అయిందోయ్! అన్నాడు, ఆ వీరుడు. ఇక అనంతర కార్యక్రమమేమిటి? అనడిగాను. ఆగవయ్యా.కొంచెం తమాయించుకోనీ. రాజకీయపక్షాల సంయోగ వినిమయాలు [పెర్ముటేషన్—కాంబినేషన్లు] ఎలా ఉంటాయో చూడనీ. ఏదో లాభసాటి బేరం చూచుకోవద్దూ. మంత్రి కాకుండా ఉండలేను గదా!— అన్నాడు. ●

# వారఫలం

## 1-2-1980 శుక్రవారం మొదలు 7-2-1980 గురువారం వరకు

**మేషం :** ఈవారం నుండి మీకు ప్రయాణ సూచనలుంటాయి. వ్యాపారం, సాహిత్యం, ముద్రణా విధానంలో మీకు ప్రగతి కనిపిస్తుంది. రాక, చాల కాలంగా నిలచిన బాకీలు వసూలయ్యే వారం. నిరంతరం కృషి గావించే మీకు అసాధ్యమయ్యే విషయాలుండవు. రాజకీయంలో శ్రమించిన మీ రాశి జాతకులకు అనేకావకాశాలుంటాయి. స్త్రీలకు :— విద్య వైజ్ఞానిక, సాంఘిక రంగాలలో అనుకూలతగలదు.

**వృషభం :** వారప్రారంభమే మంచిగా, లాభదాయకంగా, పత్రిక, గ్రంథ విక్రేతరంగాలలో సాహిత్యపరంగా, క్రీడారంగానుభవంలో కనిపించేవారం. వృధావ్యయం చేయవలసిన పరిస్థితి ఉన్నది. కొంత పొదుపు విధానం అవలంభించటం మంచిదేకదా! స్త్రీలకు :— వివిధ రంగాలలో అనుకూలత గలదు. పై చదువుల వారికి సర్వవిధాల అనుకూలం. ఒకవేళ కొందరకు విదేశ ప్రయాణం చెప్పవచ్చు.

**మిథునం :** మీ తెలివితేటలు రాణింప గలవు. వ్యాపారంలో, వ్యవహారంలో మీ కృషి ఫలించే అవకాశముంటుంది. చిత్రరంగం, సంగీతపాటకులకు, కావలసినన్ని అవకాశాలుంటాయి. ముందు వెనుకలాలోచించి కార్యరంగంలో దిగితే మీకుఆదాయం, అనుకూలం, లాభం, సమకూడే వారం. భూసంబంధ వ్యవహారాలు పరిష్కారమవుతవి. స్త్రీలకు :—వృధా ప్రయాస, వ్యయం, అనవసరం త్రిప్పట చెప్పవచ్చు.

**కర్కాటకం :** సాహిత్య రంగంలో, ముఖ్యంగా రచనా వ్యాసంగంలోవ్యవహరించే వారికి అనుకూలం. అయిన వారితో, కానివారితో మాటపట్టింపులుంటాయేమో జాగ్రత్తగా చూచుకోండి. గ్రంథ విక్రేతంకు రాజకీయ, క్రీడారంగానుభవం గలవారికి, అనేకవిధముల అవకాశాలుండవచ్చు. రంగస్థల వేషధారులకు అనువైన అనుకూలమైన వారం. స్త్రీలకు:— శ్రద్ధాసక్తులతో కార్యారంభం చేయగలరు. ధనాదాయం కలదు.

**సింహం :** ఇరుగుపొరుగువారితో, మాటల సందర్భంగా ఇబ్బందులు కలుగవచ్చు. రాశి యందు స్థితమైన గ్రహాలు, మంచిచెడ్డ కలయికతోవారం గడిచేలాగు చేస్తారు. భూగృహసంబంధమైన చిక్కుల నుండి తప్పించుకొనుటకు, పరిష్కారము శాంతియుతంగా చేసికొనుటే మంచిది. దూరప్రాంతాల నుండి మీకు లాభదాయకమైన వార్తలందుతవి. స్త్రీలకు :— ఉన్నత ఉద్యోగంలోని వారికి అనేకవిధాల లాభదాయకం. కొందరకు ప్రమోషన్ లభింపగలదు.

**కన్య :** రాశియందు స్థితుడైన శనిగ్రహం, శరీరాయాసం, త్రిప్పట, అనవసరపు గొడవలకు, మనస్పర్థలకు దారితీయుగలదు. కాన, స్థితిని గమనించి, ఆహార విహారాదులలోజాగ్రత్త వహించటం ఎంతైనా అవసరం. మాటకు విలువతగ్గడం, బంధు ప్రీతి దిగజారటం గమనించగలరు. స్త్రీలకు :— కృషి ఫలించి, వ్యయసాయం అనుకూలమై, వివాదములు లేక, ప్రశాంతంగా, విలాసవస్తుసేకరణతో వారం గడిచిపోతుంది.

**తుల :** చిక్కులలో నుండి విముక్తి పొందగలరు. చాల హాయిగా, మబ్బువిడిచిన సూర్యునిలాగుంటుంది మీ పని. ప్రయత్నించిన కార్యం సఫల్యమవుతుంది. ఆత్మీయులు యింటికి రాగలరు. అనేక ముఖ్యవిషయాలను గూర్చి చర్చింపగలరు. మీరుచేసే వ్యాపారంగాని, మీ వృత్తిగాని బాగా రాణింపగలదు. స్త్రీలకు :— గృహానందం సాహిత్యపరమైన రాబడి లభించటం గ్రహిస్తారు.

**వృశ్చికం:** ఇబ్బందులు మంచు విడిపోయినట్లు విడివడుతవి. నూతనంగా కొన్ని విలువగల వస్తువులు సేకరింపగలరు. ధర్మగుణం మీలో పొడసూపగలదు. ఆరోగ్యం కుదుటపడుతుంది. నూతన వ్యాపారం పైకి దృష్టిమరలుతుంది. సోదరవర్గంతో కలసి ఏదైనా లాభదాయకమైన వ్యాపారమో, వ్యాసంగమో, ఉండే అవకాశమున్నది. స్త్రీలకు :—ఉద్యోగాభివృద్ధి, గృహానందం, ధనలబ్ధి ఉండగలదు.

**ధనుస్సు :** చేతినుండి జారిపోయిన ధనం మరలా లభించటం, నష్టం వస్తుందనుకొన్న వ్యవహారంలో లాభించటం, మంచిదేగదా! బాగా కృషిచేయవలసిన వారం. వ్యాపారానుకూలత గలదు. కుటుంబ శుభకార్యాలోచనలు చేయగలరు. రాజకీయంగా లాభదాయకం. సంఘసేవా పరాయణులవుతారు. నోరక్క వలన యిబ్బందులుంటాయి. స్త్రీలకు :—ఏవిధంగా లోపంరాదు. ధనలబ్ధి గలవారం.

**మకరం :** వ్యవహారాలలో తృప్తికలుగదు. తోడివారితో, మీ అభ్యుదయం చూచి ఓర్వలేని వారితో మనస్పర్థలో, చిలిపిజగడాలో ఉండగలవు. అందువలన 'మౌనం సర్వార్థసాధనం'— కుటుంబంలో అనారోగ్యం చెప్పవచ్చు. అధికవ్యయానికి దారితీసే వారంగా, వార ప్రారంభంలో గమనించగలరు. సంతానాన్ని గూర్చిన ఆనందం లభ్యం. క్రీడారంగానుభవం గల వారికి, కొన్ని అవకాశాలు చిక్కుతాయి. స్త్రీలకు :—ఆదాయం, వృద్ధి కనిపిస్తుంది.

**కుంభం :** మీరు గావించే వ్యాపారంలో చిక్కులు రావచ్చు. కొన్ని వ్యవహారాలు అసలు ముందుకు సాగవు. దీనికితోడు అనారోగ్యత పొడసూపుతుంది. వాహనాలు ఎక్కటంలో జాగ్రత్తపడాలి. దావాతగాదాలున్నవారికి ఒకవేళ యిబ్బంది కలుగవచ్చు. ఉప్పులకు, అనారోగ్యత సూచనలుంటాయి. స్త్రీలకు కుటుంబానందం, యింట శుభకార్య ప్రస్తావనలుంటాయి.

**మీనం :** మీ వృత్తివ్యాపారాలలో అనుకూలత లభిస్తుంది. భారీ వ్యాపారంలో మీకు అధికలాభాలుంటాయి. కళారంగంలో చాలమందికి లాభదాయకం. విద్యాపరిశ్రమ అనుకూలం. క్రీడారంగానుభవం యువకులకు ప్రోత్సాహకరం. కొందర విషయంలో అధికవ్యయం కనిపిస్తుంది. స్త్రీలకు :— విలాస వస్తుసేకరణ, సాహిత్యకృషి, ఆదాయం, చెప్పదగిన వారం. వారఫలం ఉత్తమం.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి



# బ్రూక్ బాండ్
# గ్రీన్ లేబిల్

## మంచి కాఫీకి సారవంతమైన రుచికి ఎల్లప్పుడూ నమ్మవచ్చును




గ్రీన్ లేబిల్ యొక్క రుచి మీరు దీనిని కొన్ని సంవత్సరంలుగా ఇష్టపడేలా చేసింది. సువాసన మరియు సంతృప్తి నిస్తుంది.

**మీ కుటుంబ సాంప్రదాయకంగా వచ్చున రుచి**

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA